# అతనంటే నాకుప్రాణం. అతన్తో ఎట్లాచెప్పేది?

నెల రోజుల క్రితం. ఇల్లోదిరి, ఆఫీసులోనైనా సరే, రమేష్ బయటకు వెళ్లాలి అంటేనే నాకు దుర్భరంగా ఉండేది. ఇప్పుడు. అతని నోటి దుర్వాసన వల్ల. అతనికి దగ్గర్లో ఉండటమే సహించ లేక పోతోంది.






తరువాత, ఒక రోజున రాధ స్నేహితురాలు, కుసుమ కాలక్షేపం కోసమని వచ్చింది.










నెల తరువాత—




ఆమెకు తప్పకుండా తెలుసు బినాకా గ్రీన్ వారిని ఒకరి నొకరికి అత్యంత సన్నిహితులుగా చేసింది

CIBA Cosmetics

60g Bi Binaca®

Binaca Green

రోజంతా, మీ శ్వాసను తాజాగా మధురంగా ఉంచగల, ప్రకృతి యొక్క స్వకీయ దుర్గంధ నివారిణి క్లోరోఫిల్ బినాకా గ్రీన్‌లో గలదు.

mcm/cg/13a tel.

ఏనోట విన్నా యిదే మాట!
ఏచోట విన్నా యిదే పాట!!
"తుగ్లక్ విష్ యు గుడ్ లక్"

చలన చిత్ర సమర్పించు

# మహమ్మద్ బిన్ తుగ్లక్



# ఉత్తరాలు

## కథలు

28—1—72 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో, జీడిగుంట రామచంద్రమూర్తిగారు 'పాత జీవితానికో క్రొత్త మలుపు' అన్న కథలో (49 పేజీలో) .... 'అదృష్టం బావుండి ఆ వూరి పంచాయితీకి చైర్మన్ కూడా అయ్యాడు ...' అని రాశారు. పంచాయితీకి వుండేది చైర్మనా? ప్రెసిడెంటా?

జక్కంపూడి కృష్ణమూర్తి, (వేదంగిపాలెం)

* *

పి. గణపతిశాస్త్రిగారి 'జేబుదొంగ' కథ చాలా బాగుంది.

కె. శ్రీనివాసాచార్యులు, (పెదగుమ్మలూరు)

## సీరియల్

చెప్పదలచుకున్నది హాటిగా, నిర్భయంగా, వాస్తవికత ఉట్టిపడేలా రచన చేయగల మనకున్న కొద్దిపాటి రచయిత్రులలో శ్రీమతి పరిమళా సోమేశ్వర్ గారొకరు. మేము ఈ మధ్యన దక్షిణ దేశంలో కొన్ని పట్టణాలు, పుణ్యక్షేత్రాలు చూడటం తటస్థించింది. 'పిల్లలతో ప్రేమయాత్ర' సీరియల్ మాకొక గైడ్‌గా ఉపయోగపడిందంటే అతిశయోక్తి కాదేమో!

పి. సూర్యప్రకాశరావు, బలంగేరు, (ఒరిస్సా)

## ముఖచిత్రం

ముఖచిత్రాల విషయంలో వారు ఎక్కువ శ్రద్ధ చూపిస్తున్నట్టు లేదు. ఎప్పుడు చూసినా మన పత్రికలో ఆడవారి చిత్రాలు మాత్రమే వేస్తున్నారు. ఇకనుంచైనా మగవారి చిత్రాలు వేస్తారని ఆశించవచ్చా?

గుండారు పాండురంగేశ్వరరావు, (కొరుకొల్లు)

## వ్యాసాలు.

శాతవాహన్‌గారు నాణెము యొక్క రెండవ ప్రక్క కనిపించకుండా దాచేసి, ఒక్క ప్రక్క మాత్రమే చిన్న మరకలు కూడా కనిపించకుండా పాలిష్‌చేసి చూపించారు! గిరిగారు రాష్ట్రపతి కాక మునుపు కొండంత ఉండేవారు, నిజమే సుప్రీమ్ కోర్టులో మరింత ఎదిగారు అది నిజమే కాని తరువాత ఆయన బొత్తిగా రబ్బరు స్టాంపు అయిపోయారు! పాకిస్తాన్తో జరిగిన యుద్ధంలో గిరిగారి నాయకత్వంలో మనదేశం విజయం సాధించిందట! భేష్! (ఇందిరమ్మకు కోపం రాగలదు.) ఇక పేదరికం మీద యుద్ధానికి బయలుదేరుతారట గిరిగారు— బహుశా ఈ మధ్యనే తెప్పించిన పిదేశ జెండావారితో కాబోలు!

—విజయ్, (విశాఖ)

* * *

భారతరత్న ఇందిరా ప్రియదర్శిని వ్యాసం చక్కగా వుంది.

మంత్రిప్రగడ శకుంతలాకళ్యాణి (విశాఖపట్నం)

ధాలు, హత్యలు, నగ్నవృత్యాలు, కత్తితోపొడుచు కోవడాలు—తప్ప ఇంకేం దొరకవుకాబోలు!

వి. మధుసూదనరావు (హైదరాబాద్)

లింగయ్యగారు కామరాజు గురించి చెప్పుట నాకేమి బాగా లేదు.

టి. కరుణాకర్‌రావు, (జనగాము)

**ఒకవారం విపరీతం**

పొలాక్కుడు గారికి, రాయడానికి అక్రమ సంబం

**సి ని మా**

'విధిని నమ్మతారా...?' లో అల్లు రామ

* * *

'విధిని నమ్ముతారా?' శీర్షిక మూలంగా తారలపై నాకున్న అభిప్రాయాలు చాలావరకు తారుమారయ్యాయి. ఈ శీర్షికను కొనసాగించవలసిందిగా కోర్తాను.

ఎ. వి. ఆర్. ప్రసాద్, (గుంటూరు.

* * *

## ఉత్తరాలు

పిల్లలతో ప్రేమయాత్ర బదులు పిల్లలతో శృంగారయాత్ర అని పేరుపెడితే బాగుంటుందేమో. మూడు నాలుగు వారాలుగా మా ఇంట్లో పెద్దలు పత్రిక నా కందనివ్వట్లేదని తెలియజేయటానికి విచారిస్తున్నా.

రాజ్యలక్ష్మి, (10వ క్లాస్)

---

# పైవారమే ప్రారంభం!

# కొత్త సీరియల్ నవల

# రాగధార

రచన:

**శ్రీమతి విమలారామం**

---




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 18-2-72

శ్రీ విరోధికృన్నామ సం॥ ఫాల్గుణమాసం॥ శు॥ చవితి

**సంపుటము : 65 సంచిక : 26**

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
**శివలెంక శంభుప్రసాద్**

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1**

విడి ప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31-20 |
| 6 మాసముల చందా | 15-60 |
| 3 మాసముల చందా | 7 80 |


## విషయానుక్రమణిక


ఉష్ట్రపక్షి తంతు
పాకిస్తాన్
బంగ్లాదేశ్‌ని గుర్తించకపోవడం
బంగ్లాదేశ్‌ని మేము గుర్తిస్తున్నాము
ఇంగ్లాండ్
రష్యా


మీ ఓటుని నాకివ్వండి దానికి బదులుగా మీకు వేరొకటి యిస్తాను
వస్త్ర బడ్జెట్లో అధిక పన్నులు
ప్రజలు
ఓటు


నిక్సన్‌కి స్వాగతం చెప్పడానికి చైనా సన్నాహాలు


టికెట్టు కోసం నేను కూడా ఢిల్లీ వెళ్ళాలి


టికెట్ కోసం హోరాహోరీ పోరు


లాభం లేదు! టికెట్ లేకుండా తిరిగి వెళ్ళాల్సిందే

# ఇండియాలో బాస్కెట్‌బాల్ ఆటకు గొప్ప భవిష్యత్తు

గడచిన ఇరవై సంవత్సరాలలో ఇండియా బాస్కెట్‌బాల్ క్రీడలలో గొప్ప పురోగతి సాధించింది. ఈనాడు ఆసియాలో ఈ క్రీడలో ఇండియా నాలుగవ స్థానంలో ఉన్నది.

అయితే, 'ముందు ముందు ప్రపంచంలోనే ఈ క్రీడలో అగ్రశ్రేణికి రాగలదని నమ్మకంగా ఆశించవచ్చునని అనుభవజ్ఞుడైన అమెరికన్ బాస్కెట్‌బాల్ కోచ్ (క్రీడా శిక్షకుడు) ఒకరు చెబుతున్నారు.

అమెరికన్ బాస్కెట్‌బాల్ ఫెడరేషన్ అధ్యక్షులగు డాక్టర్ ఎడ్వర్డ్ ఎస్. స్టెయిట్స్ ఈ దేశంలో స్వయంగా చూచిన దానినిబట్టి ఈ మాట చెబుతున్నారు. 'ఇండియాలో బాస్కెట్‌బాల్ ఆటగాళ్లలో ఆటశక్తి, ఆసక్తి బాగా పెరగటం చూచి సంతోషం అయింది' అని ఆయన ఇటీవల ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.

డాక్టర్ స్టెయిట్స్ ప్రస్తుతం ఈ దేశంలో క్రీడలలో స్వల్పకాల శిక్షణ ఇస్తూ దేశంలో పర్యటిస్తున్నారు. మదరాసులో వై.ఎం.సి.ఏ. కాలేజి ఆధ్వర్యాన నడిపిన 10 రోజుల శిక్షణ కార్యక్రమంలో పాల్గొన్నారు. దీనిలో దాదాపు 75 మంది క్రీడకులు, కోచిలు, అధికారులు పాల్గొన్నారు.

డాక్టర్ స్టెయిట్స్ ఈ దేశానికి కొత్త కాదు. 1965 లో స్ప్రింగ్ ఫీల్డ్ కాలేజి జట్టుతో కలిసి ఇండియాలో పర్యటించారు. ఆ జట్టు ఆనాడు ఇక్కడి క్రీడా ప్రియులను ఎంతో ఆకర్షించింది. డాక్టర్ స్టెయిట్స్ స్ప్రింగ్‌ఫీల్డ్ కాలేజిలో 20 ఏళ్ళుగా ఈ క్రీడలో శిక్షణ ఇస్తున్నారు. ఈయన కాలంలోనే ఈ కాలేజీ జట్టు జాతీయ ఖ్యాతి సంపాదించింది.

1972 లో మ్యూనిక్ (జర్మని) లో జరుగనున్న ఒలింపిక్ క్రీడల బాస్కెట్‌బాల్ కమిటీ ఉపాధ్యక్షులలో ఒకరగు డాక్టర్ స్టెయిట్స్ ఈ ఇంటర్వ్యూలో ఇంకా ఇట్లా చెప్పారు: 'ఇక్కడి క్రీడాకారులలో, నేర్చుకొని మరింత బాగా ఆడాలన్న పట్టుదల కనపడుతున్నది' అని అంటూ ఇది చాలా మంచి సూచన అని 'వారు తమతోడివారికి తమ అనుభవాన్ని తెలుపగలరు' అని ఆయన అన్నారు.

మదరాసు తరగతులకు హాజరైన ఇండియన్ కోచ్‌లను ఆయన ప్రత్యేకంగా మెచ్చుకొన్నారు. 'బోధన, కోచింగ్ పద్ధతులలో ఆధునికమైన వాటిని తెలుసుకొని గ్రహించటంలో గొప్ప శక్తి చూపించారు' అని ఆయన అన్నారు. చర్చకు వచ్చిన అంశాలమీద అనేక ప్రశ్నలడిగి తెలుసుకొంటూ వచ్చారని ఆయన చెప్పారు.

ఈ దేశంలో క్రీడల భవిష్యత్తుకి ఇది శుభ సూచన అని ఆయన అన్నారు.

'కుర్రవాళ్ళకు చిన్నప్పటినుంచే నేర్పండి' అని ఆయన సలహా. అట్లా అయితే, ఈ ఆటకు ఎక్కువ మందిని ఆకర్షించవచ్చునంటారాయన. స్కూళ్ళ,



ఆటలో కొన్ని పద్ధతులు చెప్తున్న కోచ్ డా॥ ఎడ్వర్డ్ ఎస్. స్టెయిట్స్.

కాలేజి స్థాయినుంచే యువకులకు నేర్పాలి. అట్లా అయితే, ఆటగాళ్ళలోని ప్రతిభను వెయటికి తేవచ్చునంటారు.

విదేశీ జట్టులు తరచు వచ్చి ఆడుతుంటే మంచిదని ఆయన మరొక మాట చెప్పారు. 'అట్లా అయితే, ఆటగాళ్ళు కొత్త కొత్త ఆట పద్ధతులను తెలుసుకొనటానికి, పోటీ తత్వాన్ని పెంపొందించటానికి అవకాశం కలుగుతుంది' అని ఆయన అన్నారు.

'బాస్కెట్‌బాల్ ఖర్చు లేని ఆట. ప్రజానీకానికి చెందిన ఆట' అని ఆయన అంటారు. స్కూలు, కాలేజీ, ఆట స్థలంలోనైనా దీనిని సులువుగా ఏర్పాటు చేసుకోవచ్చు నంటారు.

డాక్టర్ స్టెయిట్స్ బెంగుళూరులో కూడా ఒక కోచింగ్ శిబిరం నడిపారు. పాటియాలలో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్సులో నాలుగు వారాలపాటు శిబిరం నడుపుతారు.

ఈ ఆటలోకి ఎక్కువమందిని ఆకర్షించటానికి పూనుకొన్న డాక్టర్ స్టెయిట్స్‌ని తోటి శిక్షకులు ఇక్కడ ఎంతో మెచ్చుకొన్నారు. శిక్షితులలో ఒకరగు వాయల్ ప్రసాద్ ఈ అమెరికన్ కోచ్ పద్ధతి 'ఉత్తమమైనది' అని అన్నారు ఇంత చక్కని పద్ధతిని ఇదివరకు తాను చూడలేదన్నారు.

మదరాసు జిల్లా బాస్కెట్‌బాల్ అసోసియేషన్ కార్యదర్శి ఎస్. వెంకటరామన్ వీరినిగురించి చెబుతూ, ఆయన శిక్షణను ఉన్నత ప్రమాణాలను నిర్ణయించారనీ, ఇందువల్ల 'మన పద్ధతులు, ప్రమాణాలు తప్పకుండా వృద్ధి చెందుతాయి' అని అన్నారు. 'జంప్ బాల్' పత్రిక ఎడిటర్ ఎస్. పద్మనాభన్ ఈ తరగతి ఫలితాన్ని ఇట్లా చెప్పారు, 'ఈ ఆటమీద డాక్టర్ స్టెయిట్స్ రాక ప్రభావం గొప్పగా ఉంటుంది.'

అమెరికా ఒలింపిక్‌కమిటీ డైరెక్టర్ల బోర్డు సభ్యులలో ఒకరగు డాక్టర్ స్టెయిట్స్ 39 కి పైచిలుకు ప్రాంతీయ, జాతీయ క్రీడా సంఘాలలో సభ్యుడు. 1964, 1968 ఒలింపిక్ బాస్కెట్‌బాల్ కమిటీలలో కూడా సభ్యులుగా ఉన్నారు. ఈయన చాల రచనలు చేశారు. 'ఎథలెటిక్ అడ్మినిస్ట్రేషన్ ఇన్ కాలేజెస్ అండ్ యూనివర్శిటీస్' అనే గ్రంథానికి సంకలనకర్త.

—ఎ. ఎం. రాజా




# సినిమాలోకం

కొలను వెంకట దుర్గాప్రసాద్

'నేనో సినిమా తీయదల్చుకున్నానోయ్!'

కుర్చీలో కులాసాగా కూర్చుని అన్నాడు శేషగిరి.

'సినిమా తీయడమంటే పెట్టెలోంచి సిగరెట్ తీయడం లాంటిది కాదు. అయినా నీ దగ్గర డబ్బేదిరా?' వెకిలిగా నవ్వేడు వేంకటేశం.

'పది లక్షలున్నాయ్!' శేషగిరి అన్నాడు—వేంకటేశం మూర్ఛ నన్నివేశం ఎదురు చూస్తూ.

వెంకటేశం అల్లాంటిదేమి చేయలేదు. పైగా 'పిడిశావ్! నిన్ననేగా నా దగ్గర పది పైసలు అప్పుచ్చుకున్నావ్?' అన్నాడు.

'చిల్లర లేదని పుచ్చుకున్నానోయ్!'

'ఓహో!...అలా ఎంతకాలం ఎందరి దగ్గర తీసుకుందావనీ?'

'వందవనీ...పెద్ద నోటు యిచ్చేస్తా!'

'ఏవిటీ? ప్రామిసరీ నోటా? చాల్లేగాని ఇక్కడ్నుంచి వెళ్ళరా!...నన్ను ఏకాంతంగా వుండనీ, మంచి కథొకటి రాస్తున్నాను.'

'కథే రాసి నాకివ్వు!...బాగుంటే దాన్ని సినిమా తీస్తాను.'

'ఏంరోయ్! నా కథ సినిమాతీసి దాని ప్రాణం తీస్తావా? వీల్లేదు. వల్లకాదు. నేను రాయబోయేది ఓ ప్రేమ కావ్యం. ఇటీజే గ్రేట్ ఎ.........అయినా నా కథ గురించి నీకు చెప్పడమెందుకు సాహిత్య పిపాస లేనివాడికి...'

'నా దగ్గర డబ్బు లేదనేగా నీ అనుమానం?' శేషగిరి గంభీరంగా అన్నాడు సిగరెట్టొకటి తీసి ముట్టించి.

'లేదు. నీ దగ్గర డబ్బు లేదు...వుంటే ఓ పది రూపాయలు చూపించు చాలు!' నమ్మకంలేక అన్నాడు.

శేషగిరి వెంటనే వంద రూపాయల నోటొకటి తీసి వేంకటేశానికి క్లోజప్‌లో చూపించాడు.

కళ్ళు మిట మిట లాడించేడు వేంకటేశం.

'ఒరేయ్! ఎక్కడిదిరా నీకీ పది రూపాయలు? నాకు మూడ్రూపాయల అరవై రెండు పైసలివ్వాలి...ఇచ్చే యిప్పుడు.'

'పది రూపాయలు చూస్తేనే కళ్ళు తేలేశావే? వంద రూపాయలు చూపిస్తే చచ్చేట్టున్నావ్! అసలు సంగతి చెప్తా విను. మా మావయ్యకి సినిమా పిచ్చి ఎక్కువ. ఓ సినిమా తీసి చచ్చిపోవాలనుందిరా అన్నాడు మొన్న జబ్బులో మంచం

మించి లేవలేక. ఆయన్ని చూస్తే జాలేసింది. నీకెందుకు మావయ్యా... బ్రహ్మాండమైన సినిమా తీసిపారేస్తాను...నువ్వు నిశ్చింతగా వుండు...ధైర్యం తెచ్చుకో అని చెప్పాను. ఆయన బోల్డు సంతోషించాడు. నల్లధనం తాలుకు బీరువా తాళాలిచ్చి 'తీయ్! బ్రహ్మాండమైన చిత్రరాజం త్వరగా తీయ్. తీసేలోపు నే చచ్చిపోతే నా ఫోటోకి అత్తయ్య పూజ చేస్తున్నట్టు ఓ షాటు తీసి టైటిల్సుకి ముందు వెయ్యి. మరి అత్తయ్య నా ఫోటోకి పూజ చేయడానికి ఒప్పుకుంటుందో లేదో...ఎలాగైనా ఒప్పించే భారం కూడా నీదే.' అన్నారు—ఆనంద భాష్పాలు రాలుస్తూ.

వేంకటేశం గభాల్న శేషగిరి గడ్డం పుచ్చుకున్నాడు. 'ఒరే ఒరే! నిన్ను అపార్థం చేసుకున్నాను, నన్ను మన్నించరా! నా కథ సినిమా తీయవూ! ప్లీజ్! నీ ఇష్టం వచ్చినట్టు తీయ్. నే కాదన్ను. నా బాబు కదూ! నా బుజ్జి కదూ!

'నేను అవేం కాదుగాని ముందు నా మించిలే! నే చెప్పినట్టు విను.'

'చెప్పరా చెప్పు! ఈ క్షణంనుంచి నీయీ స్నేహితుడు ఏం చెయ్యమన్నా చేస్తాడు,' వినయంగా నిల్చున్నాడు వేంకటేశం.

'కథ పూర్తిచేయ్ ప్రస్తుతానికి'

వెంటనే వేంకటేశం కథమీద కూర్చున్నాడు. మధ్యలో కథ రాయడం ఆపి 'మరి మన సినిమాలో హీరో ఎవర్రా? అభినవ రాణా? మన్మధరావా? అడిగాను.

'తర్వాత ఆలోచిద్దాం'

'అలా బాగోదురా. హీరో ఎవరో ముందే నిర్ణయించుకుంటే, కథ రాయడం బోల్డు సులభం—నీకు తెలీదుగాబోలు'

'ఎవరైనా కొత్త వాళ్ళని తీసుకుందాం'...

'రేయ్ రేయ్! నేను హీరోగా వుంటానా...నేను కొత్త వాణ్ణే కదమ్మా!' బతిమలాడాడు వేంకటేశం

'అన్నీ మనవే అయితే ఆరోగ్యం చెడుతుంది, సినిమా చెడుతుంది. ముందు కథ రాయి' విసుగ్గా అన్నాడు శేషగిరి.

'ఓరీ! అప్పుడే ప్రొడ్యూసర్ దర్జా వచ్చిందే!' అని ఇక మాట్లాడ్డం మానేసి, కథ కంటిన్యూచేసి పూర్తిచేశాడు పది నిముషాల్లో.

'అప్పుడే పూర్తిచేశావుటా! మరి స్నాయిడ్ వేసినంత సేపుకూడా వుండదా సినిమా?' వీలయినంత ఆశ్చర్యపోయాడు శేషగిరి.

'మరేమిటనుకున్నావ్? నీ మాటలెంతో నన్ను ఉత్సాహపరచడం మూలాన ఒకే ఊపులో రాసేసాను.

'ఇదేం కథరా బాబూ! ఒక పేజీయేనా?'

'సినిమా కథ ఎంతుంటుంది? పాటల పుస్తకంలో ఇంత కథేగా వుండేది.'

'ఓహో...అదా!' అని 'మరిమాటలెవరు రాస్తారోయ్' నీ బాబా?!' కోపగించుకున్నాడు.

'మాటలేవుంది, తర్వాత రాసుకోవచ్చు. ముందు నటీనటుల్ని ఎన్నుకొని వాళ్ళకి ఈ కథచెప్తే మాటలు ఎలా రాయాలో వాళ్ళే చెప్తార్ట. పెద్ద పెద్ద డైలాగులుంటే వాళ్ళకి నోరుతిరగదట.'

'కానీ మనం కొత్తవాళ్ళతో తీస్తున్నాం కదోయ్! కొత్తవాళ్ళయితే ఏం చెయ్యమన్నా చేస్తారు, సముద్రంలో దూకమన్నా దూకుతారు'

'హీరోయినూకూడా కొత్త మొఖమేనా?'

'అంతేగా మరి' నోరూరగా అన్నాడు.

'మా వీధిలో సుబ్బుల్ని నీ వెరుగుదువుగా? డాన్సు నేర్చుకొంటోందిరా. సినిమా పాటలు, ఆటలు క్షుణ్ణంగా వచ్చుట... కళ్ళు భలే తిప్పుతుందిరోయ్!'

'కళ్ళు తిప్పితే సరిపోయిందేమిటీ? ఒళ్ళు కూడా తిప్పాలి...అప్పుడే సినిమా హీరోయిన్ అనిపించుకుంటుంది.

'అయితే అమ్మాయికదీ వచ్చో కనుక్కుంటా!'

'వెర్రిమొహం, నువ్వేమీ కనుక్కోనవసరం లేదులే! అప్పుడు నువు రాసిన కథకి మాటలు రాయి. మాటలంటే నువ్వెప్పుడూ మాట్లాడే వెధవమాటలు కాదు మంచి మాటలు రాయి...నాకింకా అర్జంటు పనులున్నాయి వస్తా మరి'

* * *

ఇదొక తార జనంతి, శేషగిరీ, వేంకటేశం కార్లో బరుమని లోపలికి ప్రవేశించారు. కారయితే గుర్రు ఏమీ అనదు,

హరి రామ్



గాలినడక వాళ్లనయితే అడ్డగిస్తాడుగానీ.

కారు చప్పుడువిని వారులోంచి దిగుతున్న మనుషుల్ని చూసి తార గబగబా అందంగా సర్దుకుంది పవిటని.

శేషగిరి ఖరీదైన సూటులో కార్లోంచి దిగాడు. వెంకటేశానికి ఖద్దరు లాల్చీ, పైజామా శిల్కుని కుట్టించాడు ఆ దుస్తుల్లో వేంకటేశం కూడా దిగాడు.

లోపలికి వీళ్లు అడుగు పెట్టగానే 'రండి కూర్చోండి' అంది తార తనూ అందంగా కూర్చుంటూ,

'మేమో సినిమా తీయబోతున్నామండీ!'

'ఎవరూ హీరో?'

'ఓ కొత్తబ్బాయిని తీసుకున్నాం' శేషగిరి అన్నాడు ఒకళ్ళని దృష్టిలో పెట్టుకొని.

'ఆబ్బాయి ఇతను కాదుగదా కొంపదీసి' వేంకటేశాన్ని చూపించి అడిగింది.

'అబ్బే కాదండి! ఇతను నా స్నేహితుడు. ఇతనే కథా, మాటలు రాసేది మన చిత్రానికి.

'ఓ, అల్లాగా!' చాలా సంతోషం. హీరో కొత్తవాడ్ని పెడుతున్నందుకు చాలా సంతోషంగా వుంది. చెప్పొద్దూ, పాతవాళ్లతో బోరు కొట్టేస్తోందనుకోండి' అని తల ఓ గుమ్మంవేపుకు తిప్పి 'జానీ' అని పిల్చింది రెండుక్షణాల్లో ఓ నాలుగేళ్ల పాప వచ్చింది.

'ఈ పాపనికూడా సినిమాలో తీసుకోండి.' అంది తార మరింత అందంగా కూర్చుని.

శేషగిరి ఆ లందం చూసి అబ్బురపడి పోతున్నాడు.

'మేం తయారుచేసిన కథలో ఈసైజు పాప లేదమా లేదండి...కదటోయ్!' శేషగిరివంక తిరిగి అన్నాడు వేంకటేశం.

'లేపోతేమాత్రం ఏం? కథ మార్చడం చేతగాదా?' ఆశ్చర్యంగా చూసింది వేంకటేశం వంక.

'ఓ యస్! కథ మార్చేద్దాంలెండి! అదెంతపని!' శేషగిరి అన్నాడు.

'ఈ బేబి ఎవరండీ! మీ బేబా?' వెంకటేశం అడిగాడు.

'అబ్బే కాదండీ?...నాకింకా పెళ్లి కాలేదుగదా' సిగ్గుపడి నవ్వింది.

'అయితే మీరు మరి పెళ్లిచేసుకోరా?' శేషగిరి అడిగాడు.

'అప్పుడే ఎందుకండీ?' నవ్వింది.

## సినీ(మా)లోకం

'అవున్లెండి' వేంకటేశం నవ్వి అన్నాడు. 'అయితే ఈ బేబీ ఎవరండి? బోల్డు బావుంది?'

'మా చెల్లి మనవరాలండీ!'

'ఓహో! చాలా బాగుందండి! జానీ! ఇలారామ్మా! ఏదీనవ్వు...బేబీ...నవ్వమ్మా!' శేషగిరి ఆ పిల్ల బుగ్గ మెత్తగా పట్టుకొని అన్నాడు. ఆ పిల్ల వెంటనే ఏడుపు ప్రారంభించింది.

'ఊర్కో' అలా ఏడవకూడదూ తప్పు! లోపలికెళ్లు!' అని లోపలికెళ్లి జానీని వదిలి వచ్చి కూర్చుంది తార మళ్లా మరింత అందంగా. 'ఈ జానీతో ఓ చిక్కు వుందండి! నవ్వమంటే ఏడుస్తుంది. ఏడవమంటే నవ్వుతుంది.' అంది.

'ఓ అలాగా! పోన్లెండి. నవ్వించాల్సొచ్చినప్పుడు ఏడవమందాం, అలాగే వైసువెర్సా! కిటుకు తెల్సిందిగదా' శేషగిరి నవ్వాడు.

'డైరెక్టరెవరండీ? ఆయనకి చెప్పండి ఈ కిటుకు.'

'అలాగే! తప్పకుండా!' శేషగిరి తలూపాడు.'

'అన్నట్టు! నాదగ్గర 'సలోమి' కూడా వుందండి. ముద్దుగా వుంటుంది కుక్కపిల్ల. దాన్నికూడా సినిమాలో...'తార మరీ అందంగా కూర్చుని నవ్వింది.

'చూడండి! మీరు పెంచుతున్న జంతువులన్నీ సినిమాలో పెట్టేద్దాం సరేనా?' శేషగిరి హామి యిచ్చాడు.

'ఇంతకీ మీరు తీయబోయేది పౌరాణికమా? జానపదమా? సాంఘికమా? అడిగింది.

'ఇంకా తేల్చుకోలేదు ఏదీను. ఏదయినప్పటికీ మీ జంతువులను మర్చిపోను.'

'త్వరగా తెమలండి మరి!'

'రేపటికల్లా ఓ నిర్ణయానికొస్తాం. మీరుమాత్రం మా చిత్రంలో హీరోయినుగ వుండాలి' శేషగిరి ఆమె చేతుల్ని పట్టుకొన్నాడు. 'తప్పకుండా' తార నవ్వింది.

వేంకటేశం చూస్తూ వుండిపోయాడు

*

'ఆవిడ పౌరాణికమా జానపదమా, మరియూ సాంఘికమా, అనడుగుతుంటే రకీమని చెప్పొద్దూ సాంఘికమని' వేంకటేశం అన్నాడు.

'కథదేవుంది, నాగారకాలుగా సినిమా తీయొచ్చు రాములవారు, సీతమ్మకథ అందరికీ తెల్సిందేగా అదే కథను సాంఘిక చిత్రంగా తీయొచ్చు'

'సరే! కథ ఇష్టం నీ ఇష్టం వచ్చినట్టు తీసుకో! అన్నట్టు హీరోయిన్ను కూడా కొత్తవాళ్లనే తీసుకుంటా నన్నావుగా?'

'ఆ– వందమందిని స్క్రీన్ టెస్టు చేసాను ఒక్కళ్లూ లాభంలేదని పించింది' చప్పగా అన్నాడు శేషగిరి 'అన్నట్టు... మంచిపాటలు ఎవరురాస్తారో కనుక్కోవాలి!!

## ఓం నమః శివాయః

కం॥ సంపూర్ణ నళినిత నతిని
సామగాన సంప్రీతి నత్కృల
సంజాతన్
సిరి గిరి రెండున్న దాన
సీసపద్య గేయాలు వ్రాయు
సరస్వతిన్॥

కం॥ సులభశైలి కవిత్రి రచిత్రి
సూక్ష్మసంగ్రహిత సుజ్ఞాని సుధ
సుచరితన్
సృష్టి ప్రతిసృష్టి సేతును
సన్మాహో పేషితను సంరక్షించు
చంద్ర మూడా॥

కం॥ సెందనోరెద సి దరిస్
సేద దీర్చు సాక్షాత్ సత్యసుధీరా
పై యనిపించుకొనియెదను
సొగసుచేయ శృంగారించుకొన
శుభవతి నే॥

కం॥ సోముని బిల్వ పత్రముతో
సౌమ్యముగ పూజించి ప్రేమాంజలి
ఘటింతున్
సందర్శింతు ఆత్మార్పణంబు
సహానుని, నిష్కళంక,
నిష్కపటు, విగర్వి నిధిన్॥

రచయిత్రి : శ్రీమతి సరస్వతిగిరి.

'అదేమిటోయ్ శేషగిరీ? కథరాసాను, మాటలు రాసాను. ఇక పాటలు రాయడానికి ఓపిక లేదంటావా? లేక పాటలు రాయలేనంటావా

'నువ్వు రాయలేవురా!'

'ఆఁ?! ఏంతమాటన్నావురా! కాలేజీ మాగజీన్లలో ఎన్ని గేయాలు రాసేనురా? ఎంతమంది ఎన్ని రకాలుగా మెచ్చుకున్నారు? మన కాలేజీ బ్యూటీ కవితా ఛటర్జీ ఎంత మెచ్చుకుంది?

'ఆ పిల్లకి తెలుగు మాతృభాష కాదు గదా! ఏదయినాగాని ఒరేయ్ నువ్వేమీ బాధ పడక. పాటలు గేయాలు రాయగలవు నువ్వు. కాదన్ను కానీ సినిమా పాటలు రాయటం తేలిక కాదు. రెండు...రెండర్థాలు వచ్చేట్టు రాయాలి...అల్లాటప్పా కాదుమరి.

'సినిమా పాటలకర్థాలెందుకోయ్?'

'అదీ నిజమేననుకో...కానీ...ప్చ్...వద్దులేరా...ఈసారికి నా మాట విను.'

శేషగిరీ, వెంకటేశం ఓ సంగీత దర్శకుడి ఇంట్లోకి అడుగుపెట్టారు. సంగీత దర్శకుడు ఆ సమయంలో ఇంగ్లీషు ట్యూన్లు వింటున్నాడు.

'నమస్కారమండీ!' అన్నారిద్దరూ.

గబుక్కున ఆయన రేడియో కట్టేసి, 'రండి కూర్చోండి. మీ గురించి విన్నాను. సినిమా తీయబోతున్నారటగా. నేనే వచ్చి కలుద్దామనుకున్నా, కానీ కుదర్లే' నల్ల పళ్ళతో నవ్వాడు.

ముగ్గురూ సోఫాల్లో కూర్చున్నారు.

మీరు మా చిత్రానికి సంగీత సారథ్యం వహించాలి' శేషగిరి అన్నాడు.

'తప్పకుండా!'

'మంచి ట్యూన్లవీ ఏరి వుంచండి!'

'అయ్యో! తప్పకుండా!' ట్యూనులిస్తాను పాటలు రాయించుకుంటారా? లేపోతే పాటలు రాయించుకు రండి ట్యూనులు కట్టేస్తాను... 'నే నెలాగైనా చైగల్ను. ఎంత పెద్ద మాటైనా సరే బాణీ కట్టేస్తాడు చక్కగా విరిచి పాడిస్తాను...సరేనా?' సంగీత దర్శకుడు బొంగురు గొంతుకతో అన్నాడు.

'ఆ నమ్మకంతోనే మీ దగ్గరకొచ్చాను' శేషగిరి అన్నాడు. వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు చాలాసేపు. వేంకటేశం మాత్రం మామూలుగా కూర్చుని వింటున్నాడు.

* * *

శేషగిరి ఓ ఆఫీసు పెట్టేసి అందులో కూర్చొని ఆలోచిస్తుండగా ఓ గడ్డం పెరిగిన మనిషి లోపలికొచ్చాడు.

'నమస్కారం సార్!' అన్నాడు.

శేషగిరి అతని నమస్కారం స్వీకరించి 'కూర్చో! ఏం కావాలి?'

'ఫర్వాలేదు లెండి...మీరు ఓ సినిమా తీస్తున్నారని విన్నాను'

'అవును? ఏం కావాలి?'

'నా పేరు గుర్నాథం నేను ఇరవై ఏళ్ళ క్రితం సినిమా వేషాలకోసమై వచ్చి ఆ ఛాన్సు దొరక్క, స్టుడియోల్లో అన్నిరకాల ఉద్యోగాలూ చేసేసరికి ఒకరు అసిస్టెంటు డైరెక్టరుగా పెట్టుకున్నారు. తర్వాత

ఆ ధైర్యంతో నాకున్న ఆస్తినంతా అమ్మి ఓ మంచి సిన్మా తీసాను. దాని పేరు 'ఎడారిలో తడారిన తటాకం.'

'అరే! నిల్చున్నారే! కూర్చోండి...అవును ఆ పేరు విన్నాను...పూర్తి చేశారా దాన్ని?' శేషగిరి కుతూహలంగా అడిగాడు.

గుర్నాధం కూర్చున్నాడు. 'పూర్తి చేసాను, విడుదలా చేసాను.'

'ఓ విడుదల కూడా చేసారా? ఎప్పుడు?'

'ఆర్నెల్ల క్రితం సార్! రెండ్రోజు లాడింది. మొదటిరోజు ప్రివ్యూ లెండి.'

'ఓ అదా! మర్చిపోయాను' శేషగిరి నొచ్చుకున్నాడు.

'దయచేసి నాకు మీ సినిమాకు దర్శకత్వం వహించే అవకాశం యివ్వండి...'

'మీకా?' భయంగా అన్నాడు శేషగిరి.

'అవును సార్! ఇరవై ఏళ్ల అనుభవముంది—డైరక్టరుగా కాదనుకోండి. అయినా ఒక్కసారి సినిమా డైరెక్టు చేసేసరికి తెల్సిపోయింది, సిన్మా ఎలా తీస్తే దెబ్బతింటుందో. దాన్నిబట్టి సిన్మా ఎలా తీస్తే బాగుంటుందో నోట్సు తయారుచేసాను... మీరు దయచేసి అవకాశం ఇవ్వండి. జీతం ఫీజు ఇవ్వనవసరంలేదు. నాకూ, మాఆవిడకి, ఏడుగురి పిల్లలకీ మూడు పూట్లా తిండి పెడితే చాలు. ఈసారి నేను డైరెక్టు

# సినీ(మా)లోకం

చేయబోయే చిత్రం విజయవంతమై తీరాలి... ప్రజలమీద పగ తీర్చుకోవాలి...' చివరిమాటలు ఎంతో ఆవేశంతో బల్లగుద్ది అన్నాడు.

అతని పట్టుదలకి అచ్చెరువొంది శేషగిరి 'యస్! మీరే మా చిత్రానికి డైరెక్టరు' కరచాలనచేసి అన్నారు.

• • •

శేషగిరి ఓ అబ్బాయిని చూపించి 'ఇతన్ని మన చిత్రంద్వారా సినిమా ప్రేక్షకులకు పరిచయం చేద్దామని నా ఉద్దేశం? మీ అభిప్రాయమేవిటి?' అడిగాడు గుర్నాధాన్ని.

అబ్బాయిని అడిగాడు గుర్నాధం 'నీపేరేవిటి?'

'ఆంజనేయులండి!'

'ప్చ్! పేరు బావోలేదు...ఏమన్నా నటానుభవం వుందా?'

'వుందండీ! రెండొందల నాటకాలు వేసాను. అన్నీ హీరోపాత్రలే! చాలా పరిషత్తుల్లో బహుమతు లందుకున్నాను' ఆంజనేయులు సంతోషంగా చెప్పాడు

'వెరీగుడ్!' అని శేషగిరి వేపు తిరిగి, 'ఇతనికి హీరోయిను తండ్రివేషం యిద్దాం. నాటకానుభవం బాగా వుందంటున్నారు గదా! పైగా ఫీలింగ్సవీ బావున్నాయి' అన్నాడు గుర్నాధం.

శేషగిరి ఆశ్చర్యపోయి, ఆంజనేయులు వంక చూసి 'నువ్వు తర్వాత కనిపించు విచారపడకు. ఏదో ఒక వేషం యిస్తాంగా' అన్నాడు.

ఆంజనేయులు భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆలోచిస్తున్న శేషగిరిని చూసి 'సార్! మనం తీయబోయే సిన్మా బావుండాలంటే, యాక్టు నదీ రాకపోయినా ఏపుగా పెరిగిన కుర్రాడ్ని హీరోగా తీసుకోవాలి. అంతేగాని హావభావాలు ప్రదర్శించేవాళ్లు మనకనవసరం సార్! మన కథే వేరు — సిన్మాయే వేరు...

'సరే! అనుభవం మీద చెప్తున్నారాయె: మీ మాట ప్రకారమే కానీండి'

'మీరలా ప్రోత్సాహిస్తే చాలు బ్రహ్మాండంగా తీస్తాను సిన్మా. మీ డబ్బు నా డబ్బులా చూసుకుంటా సార్!

•

వెంకటేశం జాగ్రత్తగా కథ అల్లి, మాటలూ అవీ చాలా చక్కగా రాసి, శేషగిరి కిద్దామని అతని ఆఫీసు గదిలో కెళ్ళాడు.

ఆ గదిలో శేషగిరి, గుర్నాధం, మరో కొత్త రచయితా శుభ్రంగా తాగుతూ పేలుతున్నారు.

'మీ కథ చాలా బావుందండి! మార్వలెస్. మాస్టర్‌పీస్. రేపట్నుంచే ప్రొడక్షన్ ప్రారంభిద్దాం' శేషగిరి మరో గ్లాసు నోటి దగ్గర పెట్టుకోబోతూ అన్నాడు.

వెంకటేశం విసురుగా లోపలికి ప్రవేశించి, 'రేయ్! మిత్రద్రోహి శేషగిరి! నాకథ నేంజేస్తావురా!'

'ఇదిగో అగ్గిపెట్టె. తీసుకెళ్ళి తగలెయ్!' జేబులోంచి అగ్గిపెట్టె తీసి యిచ్చాడు శేషగిరి.

వేంకటేశానికి ఒళ్ళు మండిపోయింది. విసురుగా బైటికెళ్ళిపోయాడు.

• • •

శేషగిరి తీసిన సిన్మా వందరోజులపండగ సందర్భంలో శేషగిరి, నటీనటులూ, దర్శకుడు, సాంకేతికులూ, అంతా వచ్చారు. వీళ్ళని చూడడానికి వచ్చిన తొక్కిసలాటలో వేంకటేశం ఒకడైపోయాడు. ●





# ఎగుమతి యందు నంది ప్రథమస్థానం పొందింది



శ్రీ బి. వి. శ్రీరామయ్య, పార్ట్నర్, మెసర్స్ బి. వి. అశ్వర్ధయ్య & బ్రదర్స్ (రిజిస్టర్డ్), బెంగుళూరు, రాష్ట్రపతి ఉన్నత ఎగుమతి బహుమతి అందుకొంటున్నారు.




ప్రపంచ ప్రఖ్యాత అగరుబత్తుల ఉత్పత్తిదార్లు ఈ ఆపేక్షింపదగిన బహుమతిని వరుసగా నాల్గవ దఫా గెలుపొందియున్నారు

"నంది" బ్రాండు అగరుబత్తులు ప్రపంచములో 44 దేశాలకు ఎగుమతి అగుచున్నవి.

ఈ విజయోత్సాహ సమయమున, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అధికారులు మాకు అందజేసిన అత్యద్భుత సహకారమును మేము మిక్కిలి కృతజ్ఞతతో అంగీకరిస్తున్నాము.

## బి. వి. అశ్వర్ధయ్య & బ్రదర్స్ (రిజిస్టర్డ్)

**183, నగరత్ పేట, బెంగుళూరు-2.**

*ఎగుమతి వ్యాపారమునందు రాష్ట్ర మరియు జాతీయ ఉత్తమ బహుమతుల విజేతలు*

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## ఎవరి పిల్లవాడు?

గుంటూరులో వో గుడిసెకు చేరువగా వో నాలుగేళ్ళ పిల్లాడి చేతులు దొరికాయట. ఆ గుడిసెకు అల్లంత దూరాన పొదలో మొండెం దొరికిందట. తత్సంబంధమైన యితర అవయవాలు దొరకలేదట. ఎవరీ పిల్లాడు? ఎవరు? ఎందుకు? ఎప్పుడు? ఏలాగ? చంపారు అన్న ప్రశ్నకు పోలీసు సమాధానం వెతుకుతోంది

## మూత్రపిండం అమ్మకం!

నా మూత్రపిండం ఎవరికైనా కావాలంటే అమ్మేస్తాను. దాని వెల (మన లెక్కలో) 21.9 లక్షలు మాత్రమే— ఎవరి కవసరముంటే వారు నాకా డబ్బు చెల్లించి, నా మూత్రపిండాన్ని తీసుకో వచ్చు అంటూ పశ్చిమ జర్మను దేశానికి చెందిన హేయింజ షేయర్ అనే ఆయనొక ముఖ్య ప్రకటన చేశారట.




ఈయన రాటర్‌డామ్ సమీపాన్నున్న ఓ డచ్ సంస్థలో మట్టి త్రవ్వి మోసే ట్రక్కు డ్రయివరట. తన మూత్రపిండం అమ్మి వేయడం వలన తనకు హాని, నష్టం వున్నదని, అందుకనే ఆ మాత్రం ధర చెప్పానని కూడా ఆయనన్నారట. కానీ ఎవరూ ముందుకు రాలేదట ఆయన మూత్రపిండం కొనుక్కోడానికి.

* * *

వాసన్ అనే వో ఆసామీ వ్యాపార నిమిత్తం ఢిల్లీ నుంచి బెరిలికి రైలులో మొదటితరగతిలో ప్రయాణం చేస్తున్నాడట ఆయనతో పాటు ఆ పెట్టెలో మరో ముగ్గురు కూడా వున్నారట. రాత్రి 12 గంటలకు షెల్‌స్‌పూర్ అనే స్టేషనులో ఆ రైలాగి, తిరిగి బయలుదేరుతున్న సమయంలో ఎవరో తలుపు తట్టిన శబ్దమయి, వాసన్ లేచి వెళ్ళేసరికి, 'ముఖానికి ముసుగు వేసుకున్న వ్యక్తి వాసన్ని తుపాకితో కాల్చి చంపేశాడట. ఈ శబ్దం విని బయటకు వచ్చిన 'మరో కాయనకూ ఆడా పిస్తోలు దెబ్బ తగిలిందట. విచారణలో వాసన్ని ఎవరూ కావాలని చంపలేదని, మరెవరి మీదో కసితో ఆ ముసుగు వ్యక్తి వస్తే, వాసన్ వెళ్ళగానే, ఆ ఖంగారులో, గుర్తు తెలీక కాల్చి చంపేసి వుండి వుండాలనీ అనుమానిస్తున్నారట— పాపం! ఆయనకు ముగ్గురు పిల్లలట

## జగద్గురు శంకరాచార్యుల హెచ్చరిక!

కేంద్రప్రభుత్వం కుటుంబ నియంత్రణో చ్ఛ అంటూ యిదే విధంగా దున్నుకుంటూ పోతే రానున్న వందేళ్ళలో హిందూమతమే చుట్టబెట్టుకు పోతుందని, కనుక తాను కేంద్ర ప్రభుత్వానికి వో అరవై రోజులు గడువు యిస్తున్నాననీ, యీ గడువులోగా గనుక కేంద్రప్రభుత్వం కుటుంబ నియంత్రణ వైఖరి మార్చుకోకపోతే తాను ఆ నియంత్రణకు సవాలుగా, ఎదురుగా తన నినాదాలు ప్రారంభించాల్సి వుంటుంది అని పూరీ జగద్గురు శంకరాచార్యుల వారు బొంబాయిలో అన్నారట— విన్నారా!

## నడివీధుల్లో ఏనుగుల యుద్ధం!

బొంబాయి సర్కసుకు చెందిన వో రెండు ఏనుగులు మంగుళూరు వీధుల్లో తిరుగుతూ మధ్య మార్గంలో పోట్లాడుకున్నాయట. ఆ పోట్లాట భీకరంగా తయారయేసరికి అక్కడి వారెక్కడెక్కడికో ప్రాణాలు చేతో పుచ్చుకుని పారిపోడం ఆరంభించారట ఈ హడావుడిలో రోడ్డు దాటుతున్న వో 20ఏళ్ళ యువకుణ్ణి సిటీ బస్సొకటి నలిపి పచ్చడి చేసేసిందట.

## హింసాత్మకంగా పరిణమించిన భూమి తగాదా

గాతక్కయిరు అనే గ్రామంలో 45 ఏళ్ళ కరుప్పాయి అమ్మాళ్ అనే ఆమె తల్లికో నాలుగెకరాల పొలం వుండట. తల్లి అనంతరం ఆ పొలం ఆమె అన్నగారు ముత్తానాయకర్ అనుభవిస్తుంటే, తల్లి ఆస్తి తనకు చేరాలని ఆమె దావా వేసి గెలిచి, ఆ పొలం తీసుకున్నదట పోయిన 23వ తేదీ రాత్రి ఏడు గంటలకు కరుప్పాయి అమ్మాళ్, ఆమె భర్త రాకియనాయకర్, వారి కొడుకు పెరియసామి, అతని భార్య రుక్మిణి మొదలైన వారు కూర్చుని కబుర్లు చెప్పుకొంటుండగా ముత్తానాయకర్, అతని తమ్ముడు చిన్ననాయకర్, సివనాధన్ షణ్ముగం, సామియప్పన్, శరవణన్, మొదలైన వారితో వారి మీద పడి, కత్తులతోనూ, యీటెలతోనూ వారిని చిత్రవధ చేశారట. ఈ హింసలో కరుప్పాయి అమ్మాళ్, ఆమె భర్త రాకినాయకర్, కొడుకు పెరియసామి అక్కడికక్కడే రక్తపు మడుగుల్లో పడి తన్నుకుని చనిపోయారట. మిగతా వారు గాయలైనా, ప్రాణాలతో పారిపోయారట. అప్పటితో కూడా శాంతించక ఈ ఆరుగురు అపర పరశురాములూ నక్కింటికి బయట గొళ్ళెం వేసి, ఆ యింటికి నిప్పంటించారట. ఆ యింట్లో వున్న 27 ఏళ్ళ పళనిసామి కాలి చనిపోయారట. అతని భార్య మాత్రం తప్పించుకు పారిపోయిందట.

## చిల్లర తక్కువిచ్చినందుకు చిత్రవధ!

తలంగై అనే వూరులో 65 ఏళ్ళ నరసింహారెడ్డి అనే ఆయన కల్లు దుకాణానికి వో ఆసామి వచ్చి ఒకటిన్నర లీటర్ల కల్లు తాగి అయిదు రూపాయలు యిచ్చాడట చిల్లర 3 రూపాయల 12 పైసలు యివ్వడానికి బదులు నరసింహారెడ్డి మూడు రూపాయలే ఆ వ్యక్తి చేతిలో పెట్టాడట ఆమర్నాడు ఆ ఆసామీ మరో నలుగురితో వో లారీలో వచ్చి నరసింహారెడ్డిని అంగడిలోంచి రోడ్డు మీదకు లాగి, తన్నాడట. తాపుకు క్రిందపడి పోయిన అతని మీద లారీ ఎక్కించి వారంతా చేరి ఆయన్ను భయంకరంగా చంపేశారట.

* * *

అస్సాల్ అనే గ్రామంలో గడ్డను ఎక్కడ మేపాలి అనే విషయం మీద ఓ చిన్న అభిప్రాయ భేదం వచ్చి అది రానురానూ పెరిగి వాగ్యుద్ధం మీదుగా ప్రత్యక్ష యుద్ధంలోకి దిగిందట. అన్సూరి పంచాయితీ ప్రెసిడెంట్ ధారాసింధాస్ అనే ఆయన, ఆయన జట్టు కలిసి ఓ స్త్రీని నిలువునా నిప్పెట్టి తగలెట్టారట.



## బంగ్లాదేశ్‌కి 25 కోట్లు

భారతదేశం నుంచి బంగ్లాదేశానికి 25 కోట్ల కిమ్మత్తు చేసే సిమెంటు, ప్రత్తి, ముడిసరుకులు, పెట్రోలు, ఔషధాలు, జనపనార, మిల్లు పరికరాలు వగైరాలు తరలించబడ్డాయట.

## పోట్లాటలో పోయిన ప్రాణం

బెంగుళూరు తిలక్‌నగర్‌లో 35 ఏళ్ళ బాబా జాన్ అనే ఆయన పక్కింటి వారితో పోరువ



పోట్లాడుతుండగా ఆ యింటి వారెవ్వరో తోపు తోశారట. దాంతో ఆయన క్రిందపడి, ఆ పడడంలో ప్రాణాలనే పోగొట్టుకున్నాడట. ●

---

### అవీ...ఇవీ:

జనవరి 23 దాకా ఇస్రాయిల్‌లో బంగ్లాదేశ్ పిల్లల నిధికోసం ఇప్పటికి లక్షాపదివేల ఇస్రాయిల్ పవున్లు వసూలు అయ్యాయి. ఇవికాక, ఆహార వస్తువులుకూడా ఇస్రాయిల్ దానం చేస్తోంది.
(ఐ. ఏ.)

*  *  *

పాకిస్తాన్‌లో ఇంతకు ముందు జరిగిన సంఘటనలో అంతర్జాతీయ జియోనిస్టు (యూదుల) వర్గాలు ఇస్లాం మతాన్ని నాశనం చేయటానికి పన్నిన కుట్ర ఫలితాలు— అన్నారు సవుదీ అరేబియా రాజు ఫయిసాల్ జిద్దాలో హజ్ యాత్రికుల సంఘాల నాయకులతో మాట్లాడుతూ. (టైమ్స్ ఆఫ్ ఇండియా జనవరి 24లో పడిన వార్త ఆధారంగా.)
(ఐ. ఏ.) ●

**ఏస్. ఎస్. ఆర్, విశాఖపట్నం**

**మానవునికి నిర్మలమైన జ్యోతిలా దారి చూపేది ఏదండీ?**

ఇల్లాలు!

**కె. జె. ఆర్, కె. ఎస్. ఆర్, తిరుపతి**

**మనసులు మమతలు కలిశాక కులమత భేదాలు చూస్తారా?**

చూడకూడదు మరి. కాని తీరా 'పెళ్ళి చేసుకో మోహన్' అని అమ్మాయి కాస్త అడిగేసరికి అమ్మ ఒప్పుకోదు సుశీ, అనో, నాన్నగారు చండశాసనుడు, కట్నం లేకుండా ఒప్పుకోరు. కట్నం ఎక్కువైతే యీ కులమత భేదాలు పట్టించుకోరు, మీ నాన్న ఎంతిస్తారేమిటి?' అనో అంటేనే వస్తుంది అసలు చిక్కు.

**ఎన్. ఎస్. పి, తాండూరు**

**మనిషికి మనీషికి తేడా ఏమిటి?**

మనిషి మనిషే మనీషి మేధావి.

**జెర్. వి. ఆర్. కాకినాడ**

**అసలు తిన్నగా మీ సంపాదక వర్గానికే రాద్దామనుకున్నాను. నారే ఆ లెటర్ మీకు యివ్వడంకంటే నేనే రాస్తే మంచి దనుకుని రాస్తున్నా. మీ ప్రశ్నావళి పత్రికకు ఉద్దండుడుగ. వచ్చే సంచిక నుండి జవాబు లివ్వడం మానేస్తారా? — మీ శ్రేయోభిలాషి.**

ఇలాంటి శ్రేయోభిలాషులు చాలామంది ఉన్నారు వీరేశ్వరరావుగారూ, నాకు చాలా సంతోషంగా ఉంది. ప్రశ్నావళి అసహ్యించుకుంటూ చదివే— మీలాంటి వాళ్ళే నాకు అసలు ఛాలెంజి! ఒక్క పేజీ తిప్పేస్తే పోయేదాని కింత కష్టపడి కార్డు రాయాలా?

**ఎస్ ఎస్, ఒంగోలు**

**స్త్రీకి పురుషునికంటే సహనమూ, అహంకారము ఎక్కువ అంటారు నిజమేనా.**

నిజమే. అంతసహనం ఉన్నవారికి అంత అహంకారమూ ఉంటుంది

**కె హెచ్. బి, ఏలూరు**

**మీరు చాలా అందంగా ఉన్నారండీ అంటే పొంగిపోని స్త్రీ ఉండదు.**

బాగుంది— నాలాంటిది అఫెండ్ అవుతుంది! అలా అంటే.

**టి. వి. ఆర్, చిన్నిగొల్లపాలెం**

**మీ స్త్రీ జాతికి పెళ్ళికాకముందు తల్లి తండ్రులమీద, పెళ్లి అయిన తరువాత శ్రీవారిమీద ఆధారపడి జీవించడమే ఆశయము. మీరు స్వతంత్రముగ బ్రతక లేరు.**

చిత్రం. రోజులు మారినట్లు గమనించలేనట్లు తోస్తుంది. ఈనాడు అమ్మాయి పెళ్ళికి ముందు




తల్లితండ్రులకి, పెళ్ళికి తరువాత భర్త గారికి చేదోడుగా ఉండడం చూడ్డంలేదా? లేకుంటే మీ కుర్రకారు ఉద్యోగం చేస్తున్న అమ్మాయి కావాలని లాపత్రయ పడ్డం తెలియటం లేదా?!

**ఆర్. ఎస్. పి, సునాబేడ**

**మీరు ప్రశ్నలకు జవాబులిస్తూ మధ్య మధ్య ఆంగ్లపదములు వాడుక చేస్తున్నారు. కారణం అచ్చతెలుగులో వీలుకాదా?**

మనం మాటల్లో రాతలో ఆంగ్లం విషేధించినట్టు తెలియక సార్! నేను ఆంగ్లబాషా వాదిని. మాతృబాషాభిమానం ఉన్నా— ఆంగ్లంపై మోజా మెండు.

**సిహెచ్ వి. ఆర్, పాలకొండ**

**జీవితంలో ఎవరు ఎక్కువ సుఖాన్ని అనుభవిస్తూ ఉంటారు?**

డబ్బు కర్చుకి వెనుక చూసుకోనివారు.

**వికటశ్రీ, అనకాపల్లి**

**చదువుకు సంస్కారానికి గల తేడా ఏమిటి?**

నీ అసలు పేరుకీ కలంపేరుకి వున్న తేడాయే నయ్యా గోవిందరాజూ'

**ఏ. బి హెచ్. ఎస్, కత్తిపూడి**

**'మీకు ప్రశ్నలు పంపువారి పూర్తిపేరు వ్రాయరు ఎందుచేత?**

మరీ చిన్న పల్లెల నుంచి ఉత్తరాలు వస్తే— అలాంటి చోట— వ్యక్తిపేరూ వూరుపేరూ రాస్తే చాలు. జాబులు అందిపోతాయి. ఈ సంగతి కనిపెట్టి సభ్యత నేర్వని అల్పసంఖ్యాకులైన నా పాఠకులు అసభ్యపు వుత్తరాలు అమ్మాయిలకి రాయడం జరుగుతుంది. అంచేత పాలకోసం రాళ్ళు మోసినట్టు ఆ అల్పులకోసం యీ పొడి అక్షరాలు అందరికీ వర్తింప చేయడం జరిగింది. ఎలాగా పొడి అక్షరాలు—మనని ఎవరూ కనుక్కోలేరని ఏదిపడితే అది రాసే పెద్ద మనుషులపేర్లు నాయితర పాఠకులకి తెలిస్తే సంతోషిస్తారని— నేనూ ఆ పేర్లు పూర్తిగా రాస్తాం టాను.

**వి.ఎం. ఆర్, పొత్తూరు**

**విషద్రావకములు తాగి ఆత్మహత్య చేసుకొనెడి వారిపై మీ అభిప్రాయం.**

త్రాగేవాళ్ళు ఎవరింట్లోనో కాకుండా వారివారి యిళ్ళల్లో త్రాగి చచ్చినా బ్రతికినా మంచిదే నంటాను. బ్రతకమనడానికి చావమనడానికీ మనం ఎవరం? మనం ఎంత? మనం ఎప్పుడు ఎలా చావాలో నిర్ణ యించే దేవుడు అదృశ్యంగా ఎప్పుడూ ఉండనే ఉన్నాడు కదా?! ఆయన పర్మిషన్ లేకపోతే— విషం తాగినా చావరు రైలుకింద బుర్రపెట్టినా చావరు.

**వి. కె. ఆర్, కాకినాడ**

**ఆశయాలు ఆశలులేని వ్యక్తి ఎందుకు బ్రతకాలి? ఎవరిని ఉద్ధరించాలి?**

ఏం— ఆశయాలు ఆశలు లేకుండా బ్రతకడమే ఆశయం ఎందుకు కాకూడదూ? ఎవరినో ఎందుకు తనని తానే ఉద్ధరించుకుందామని ఎందుకు బ్రతక కూడదు?

**జె. వి, ఆర్, పిఠాపురం**

**తిట్టుకున్నంతమాత్రాన తప్పు రైటయి పోతుందా?**

అవదు. కాని సభ్యత లోపించినప్పుడు— రైటయినా అది తప్పే.

**జి. ఎస్. ఆర్, హైదరాబాదు**

**మరి ఆడదానికి వినయం సహనం ఓర్పు యివన్నీ ఉండవలసిన లక్షణాలు కదా? మరి అవన్నీ మీదగ్గర మచ్చుకైనా కనిపించవు. అందరికీ కుండ బద్దలు కొట్టినట్టు జవాబు లిస్తారు ... మీవంటి ఉత్తమ రచయిత్రి కిలాంటి గుణం తగదంటాను.**

నేనుఆడదాన్నని ఎవరన్నారండీ. శక్తిని! సరేగాని. ...నాస్తినివో నా కొంపతీస్తివో అన్నట్టు ఉండడం వినయ చిహ్నమా? సహన చిహ్నమా? వోర్పు చిహ్నమా?

**పి. ఆర్. ఆర్, ఉండ్రాజవరం**

**స్త్రీ సాధారణంగా ఎందుకు మౌనం చేస్తుందండీ.**

మగనాడి ఎత్తుకు పై ఎత్తు వేయాలనే సార్, అంతకంటే ఎందుకూ కాదు.

**జె. వి. ఆర్, పిఠాపురం**

**మానవునకు జీవితంలో కెల్లా అమూల్యమైన వస్తువేది?**

భార్య.

**కె. పి. డి, కాకినాడ**

**మావారికి నవ్వితే కోపం వస్తుంది. ఏం చెయ్యను?**

నవ్వులు ప్రతిధ్వనించని యింట ప్రేమ లోపించి వట్టిపని చెప్పు.




వర్షం జోరుగా పడుతోంది. గట్టిగా పెనుగాలి వీచడంతో ఎలక్ట్రిక్ దీపాలన్నీ ఒక్కసారిగా ఆరిపోయాయి. సంతపాకల నిండా వర్షం. అంధకార బంధురమైన ప్రకృతిలో అప్పుడప్పుడు మెఱసే మెఱుపులు చీకట్లో బతుకులు బ్రతికే బిచ్చగాళ్ళకి పట్టెడన్నం దొరికినప్పుడు వాళ్ల కళ్లల్లో వెలిగే ఆనందరేఖల్లా వున్నాయి. పేదవాళ్లమీద విఱుచుకుపడే ధనవంతుల కఠోర కఠినస్వరంలాగ వుఱుములు గర్జిస్తున్నాయి, ఆ గర్జనలకి బెదరిపోయి బితుకు బితుకుమంటూ చిట్టి నారయ్య తాత దగ్గరకి చేరింది.

'ఎవ్వరారు ?' అన్నాడు నారయ్య వొణికే గొంతుకతో.

'నేను తాతా ! చిట్టిని.'

'నువ్వా తల్లీ ! అన్నయ్య ఇంకా రాలేదా ?'

'లేదు తాతా ! అందుకే భయం వేస్తోంది.'

చిట్టి నారయ్యతాతకి ఇంకా దగ్గరగా చేరింది. నారయ్య తను కప్పుకున్న కంబళీ దానికికూడా కప్పాడు.

'ఈ చీకటి బూచిలావుంది. అన్నయ్య పొద్దున్న వెళ్లి యింకా రాలేదు. నాకు భయం వేస్తోంది తాతా !'

'మనం బిచ్చగోళ్లం. వున్న మారాజులకి మనబాధ లేం తెలుస్తాయి తల్లీ ? తలుపేసుకు లోన యెచ్చగా తొంగుంటారు. ఈ వానలో తడిసి ఈడెడితేవమాత్రం మనోడి గోడు ఆళ్లకి యినిపిస్తదా? ఇంటే మాత్రం పట్టించుకుంట్రా? ఎలక్షన్లప్పుడే మనదెగ్గిర కొస్తారు. ఆతరవోత మన అతీగతీ నూడ్రు. మనబతుకు లింతే తల్లీ !'

చిట్టికి ఈ మాట లేవీ వినిపించడం లేదు. దాని కళ్ళు ఆ అంధకారంలో అన్నగారికోసం ఎదురుచూస్తున్నాయి.

'చిట్టీ !...చిట్టీ !'—చీకటి పిలిచినట్టుయింది.

'అన్నయ్యా! ఇక్కడున్నా నన్నయ్యా!' ఆ జవాబులో ఆనందం తొణికిసలాడింది.

చీకట్లో తడుముకుంటూ చిట్టి దగ్గరకి వచ్చాడు సూరి.

'భయం వేసిందా అమ్మా! నేను రాలే దని?'

# విధి వంచితులు

'లేదన్నయ్యా! నారయ్య తాత వున్నాడుగా?'

హఠాత్తుగా మెరిసిన మెరుపులో నారయ్య తాత కళ్ళు తుడుచుకోవడం గమనించాడు సూరి.

పేదవాడి స్నేహితుడు వాడి గుండెల్లో బాధ పంచుకుంటాడు. ధనవంతుడి స్నేహితుడు వాడి సుఖాలనే పంచుకుని కష్టాలలో వదిలేస్తాడు! పేదరికం మనిషిని దేవతగా మారుస్తుంది—ఐశ్వర్యం కొందరిలో మానవత్వాన్ని రూపుమాపి రాక్షసులుగా చేస్తుంది. వున్నవాడి కున్నంతమంది శత్రువులు లేనివాడికి వుండరు. ఉన్నవాడికి చావంటే భయం—లేనివాడికి బ్రతుకంటేనే భయం! ధనవంతుడికి రాత్రంటే భయం—దరిద్రుడికి పగలంటేనే భయం! చీకటి బ్రతుకులు బ్రతికే ఆ పేదవాళ్ళంతా ఆకలి బాధ మరచిపోయి ఆ రాత్రివేళ నిద్రాదేవి ఒడిలో హాయిగా ఒరిగిపోయారు. సంత పాకలన్నీ నిద్ర పోతున్నాయి. కాని సూరి మాత్రం మెళుకువగానే వున్నాడు. ఆకలితో నకనక లాడుతున్న చిట్టి దీనమైన రూపమే అంత చీకట్లోకూడా వాడి కళ్ళ ముందు ఆడుతోంది. ఆలోచనతో వాడి బుర్ర వేడెక్కిపోయింది. వాడి గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి. వాడి బ్రతుకులాగే యెటు చూసినా చీకటి భయంకరంగా వుంది ఇంతట్లో హఠాత్తుగా ఎలక్ట్రిక్ లైట్లు వెలిగాయి. ఆ దీపపు వెలతురులో వాడు చిట్టిని చూశాడు. ఆరేళ్ళ పసిపాప కటిక నేలమీద నారయ్య తాత డొక్కలో దూరిపోయి ఒళ్ళు మఱచి నిద్ర పోతోంది. దాని ముఖం చంద్ర బింబంలా వెలిగిపోతోంది.

'ఇది నాకు చెల్లెలుగా పుట్టబట్టే కదా దీనికి ఇన్ని పాట్లు!' అనుకొని ఒక వేడి నిట్టూర్పు విడిచాడు సూరి. వెంటనే వాడి మనస్సు గతాన్ని చీల్చుకుంటూ ఎక్కడెక్కడికో పోయింది.

ఆవేళ చిట్టి పుట్టగానే అమ్మ నిద్ర పోయింది. ఎంత పిలిచినా పలకలేదు. ఇరుగు పొరుగు వాళ్ళందరూ వచ్చి ఒకసారి చూసి వెళ్ళిపోతున్నారు, నాన్న గుండెబాదుకొని యేడ్చాడు, పదిమందీ చేరి అమ్మని ఎక్కడికో తీసుకు పోయారు. పక్కింటి పార్వతమ్మ వచ్చి ఆరేళ్ళవాడైన తనని, ఆవేళే పుట్టిన చిట్టిని కనిపెట్టుకుని వుండి నాన్న యింటికి రాగానే వోదార్చి వెళ్ళిపోయింది. నాన్న నులక మంచంమీద పడి యేడుస్తున్నాడు.

'అమ్మని యెక్కడికి తీసుకు వెళ్ళారు నాన్నా'? అని అడిగాడు తను.

'వొచ్చేస్తుంది బాబూ!'—నాన్న కళ్ళు తుడుచుకుని తనని దగ్గిరకు తీసుకున్నాడు.

'ఎప్పుడొస్తుందీ? అమ్మని ఏం చేశావ్?' మళ్ళీ అడిగాడు తను.

తనని గట్టిగా కౌగిలించుకొని నాన్న గొల్లుమన్నాడు. ఆ గొడవతో తనకు నిమిత్తం లేనట్టు హాయిగా నిద్రపోతోంది చిట్టి.

'ఇది తల్లిని మింగేసింది. నా కనకాన్ని ఇదే చంపేసింది. నా కొంప నిలువునా కూల్చేసింది.' అనేవాడు నాన్న!

తనకి ఇదేమీ అర్థం అయ్యేది కాదు. అర్థం అయిందల్లా ఒకటే – వొస్తుందని నాన్న చెప్పినా అమ్మ మళ్ళీ రాలేదు.

ఒకరోజున ఒక ముసలిది గుమ్మంలో నిలబడి 'అమ్మగారీ యిళ్ళ దరమలో గిళ్ళ – బిచ్చం పెట్టండమ్మా! బిచ్చం' అంటోంది. తను కూడా దానివెనకాలే ఆ మాటలే అనడం నాన్న విన్నాడు.

'ఓరి ముష్టివెధవా! దానితోబాటు నువ్వు కూడా అడుక్కుతింటావ్రా?' అని కళ్ళు ఎర్ర జేశాడు.

అప్పటి వరకూ యెంతో గారంగా చూసే నాన్న అలా అన్నందుకు తను యెంతో కుమిలిపోయాడు. వెక్కి వెక్కి యేడుస్తున్న తనని ఆ తరవాత బుజ్జగించినా 'ముష్టివెధవా!' అన్న ఆ మాట ఇప్పటికీ తన చెవుల్లో గింగురుమంటూనే వుంది.

* * *

చిన్న వూళ్ళో పొట్ట గడవక చిట్టినీ తనని తీసుకొని నాన్న నెల్లక్రితమే పట్నం వొచ్చేశాడు అమ్మ పోయినప్పట్నించీ నాన్న విపరీతంగా తాగుడుకి అలవాటు పడి మనస్సుతోపాటు శరీరం కూడా పాడు చేసుకున్నాడు తాగిన మైకంలో యింటికి వచ్చి 'పాపిష్టిదానా! నా కనకాన్ని నువ్వే మింగేశావ్! అంటూ చిట్టిని కసిరి కొట్టేసే

# రోజు కొక చెంచా-
# శక్తిని వృద్ధిచేస్తుంది





**మంచి కను దృష్టి:**

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ ఎ కలదు. కంటి యొక్క దివ్యమైన దృష్టి కొరకై రోజుకు 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ చాలును.

**ఆరోగ్యకరమైన రక్తం:**

సిరప్ మినాడెక్స్‌లో ఐరన్ కూడ గలదు. భారతదేశంలో అత్యధికులు (80%) ఐరన్ లోపించిన ఆహారం భుజిస్తున్నారు. కావున 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ అతి త్వరగా ఆ లోపాన్ని నింప గల్గుతుంది.

**దృఢమైన ఎముకలు:**

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ డి కూడ గలదు. ప్రతి రోజూ 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ తీసుకొన్నచో ఎముకలకు మంచి దృఢత్వమును కలుగజేస్తుంది. గుర్తుంచుకోండి. రోజూ 1 చిన్న చెంచాడు నారింజ సువాసనగల మినాడెక్స్ బిడ్డకు మూడింతలు ఆరోగ్యరక్షణ నిస్తుంది.

సిరప్
# మినాడెక్స్®

ఒకే చెంచాలో మూడు గుణములుగల టానిక్

గ్లాక్సో

CMGM-6244 Tel

పాడు. ఒకరోజున దాని బాధ చూడలేక తను అడ్డం వెళ్ళాడు.

'దాన్ని చంపెయ్యకు నాన్నా!' అని ప్రతిమాలాడు.

'నేను చంపేవాణ్ణి—నువ్వు బతికించే వోడివీనా? నువ్వు నాకు సెప్పాలంట్రా? మీ యిట్టం వొచ్చినట్టేడవండి.' అంటూ తూలుతూ ఆవేశంగా బయటికి వెళ్ళిన నాన్న మళ్ళీ రాలేదు. ఒకరోజు గడిచింది. రెండురోజులు గడిచాయి చిట్టికీ తనకీ భయం వేసింది. గంజి కాచుకుందుకు ఇంట్లో బియ్యం కూడా లేవు. మూడవ రోజున నాన్నని వెతకడానికి తనూ చెల్లెలూ పొద్దుట్నుంచి పట్నం అంతా తిరుగుతూ సాయంకాలం సంతపాకల దగ్గరకి వచ్చారు. అక్కడ వాళ్ళకి పిళ్ళయ్య కనిపించాడు. దిక్కులేని తనన్నీ, చిట్టినీ చూసి జాలి పడ్డాడు. డాక పిడతలో మిగిలిన గంజి తెచ్చి ఇద్దరికీ పోశాడు. ఆ గంజితాగి చెల్లెలూ, తనూ అక్కడే పడుకున్నారు. ఆ రాత్రికి నారయ్య తాత కూడా అక్కడికి చేరాడు. తనకథ అంతా విని యెంతో జాలిపడ్డాడు.

'మాతోపాటే నాలుగువీధులు తిరిగితే మీ పొట్ట మీకు గడిచిపోద్ది' అని సలహా యిచ్చాడు.

మరోదారిలేక అందుకు ఒప్పుకొని చిట్టీ, తనూ బిచ్చగాళ్ళుగా మారారు. మొదట్లో ముష్టికి బయల్దేరి నప్పుడు తనకు తల కొట్టేసి నట్టయింది. జోలె పుచ్చుకుని పిళ్ళయ్య వెనకాల నిలబడ్డాడు తను. చిట్టి, తనవెనకే నిలబడివుంది. కుంటివాడైన పిళ్ళయ్యకి గుప్పెడు బియ్యం వేసిన పెద్దమనిషి తనని యెగాదిగా చూశాడు.

'సిద్ధిలా వున్నావ్—ఇలా వూరిమీద పడకపోతే యేదైనా పనిచేసుకోకూడదూ?' అని వురిమాడు.

'పనివుంటే చేస్తాను – ఇప్పించండి బాబయ్యా!' అన్నాడు తను.

తను నమ్రతగానే అడిగినా ఆయనకి అరికాలిమంట నెత్తికెక్కింది.

'నా మాట నాకే అప్పచెప్పావ్? నీలాంటి దొంగవెధవల్ని యింటికి చేరిస్తే కొంపంతా దోచెయ్యరూ? ఛో! ఛో!' అని గట్టిగా కసిరి లోపలికి వెళ్ళిపోయాడు ఆ యింటివాడు.

ఆ అవమానం భరించలేక మకాము లోకి వొచ్చేశాడు తను.

'అళ్ళు కడుపునిండి నోళ్ళు. అళ్ళకి మనబాధేం తెలుస్తది? అట్టాటోళ్ళు యేదో అన్నారని పౌరుషపడితే మనపొట్ట యెట్టా గడుస్తది?'— సముదాయించాడు నారయ్యతాత.

ఆ మర్నాడు తనూ, చిట్టీ పదివీధులు తిరగ్గాతిరగ్గా అరసోలెడు గింజలు చేరాయి. కసిరినవాళ్ళు కసిరారు. పెట్టినవాళ్ళు పెట్టారు. అప్పటికది కష్టంగానే వున్నా గంజి తాగుతున్నప్పుడు ఆ క్షణం అవన్నీ మరిచిపోయాడు తను.

సిగ్గువిడిచి అలా వీధినిపడ్డా ఒక్కోరోజున తనూ చిట్టీ పస్తుపడుకోవలసి వస్తోంది

ఎక్కడో కుక్క మొరిగింది. కోడి కూసింది. ఆలోచనలతో సతమత మవుతున్న సూరికి యెప్పుడు నిద్రపట్టిందో వాడికే తెలియదు.

సూరి లేచేసరికే నారయ్య తప్ప తక్కినవాళ్ళంతా వూళ్ళోకి వెళ్ళిపోయారు. వాన వెలిసింది. ఆకాశంనిండా మళ్ళీ మబ్బులు అలముకొంటున్నాయి. ఏక్షణంలోనైనా వర్షం పడేటట్టుంది. నెమ్ముకు పోయినచుట్టని వెలిగించే ప్రయత్నంలో వున్నాడు నారయ్య.

'లెగిశావంట్రా సూరీ! సిట్టెమ్మకి ఆకలంటది. తొరగాయెల్లి నాలుగ్గింజలెట్రా.'

'అలాగే తాతా!'

'ఈవోన శనిలా పట్టుకుండది. ఏ న్నాళ్ళిడిపిస్తదో యేటో!'

'నేనుండగా నీకేటి భయంతాతా? ఇంకో రెండువీధులు తిరిగి నీక్కూడా గింజలు నేనే తెస్తా.'

'నాతండ్రే – నాతండ్రే – యెల్రా' అంటూ చింకిచాపమీద నడుం వాల్చాడు నారయ్య.

* * *

'ధర్మం చెయ్యండి బాబయ్యా!'— గుమ్మంలో నిలబడి సూరి దీనంగా అడిగాడు. వాడివెనకాలే చిట్టికూడా అదే పాఠం అప్పగించింది.

'ఎక్కడుందిరా ధర్మం? మాజీతం రాళ్ళు మాకేనాలక ఛస్తూంటే మీక్కూడా ఎక్కడ? పొండి. పొండి.' అన్నదొక గొంతు.

'కుంటివాళ్ళకీ. గుడ్డివాళ్ళకీ అయితే తప్పదు. కళ్ళూ కాళ్ళూ వున్నవాళ్ళు కూడా వొచ్చి కొంపమీద పడితే యెంతమందికి పెట్టగలం?' అంటూ ప్రశ్నించిది మరొక గుమ్మం.

వెంటనే వెర్రెయ్యా అన్నమాటలు సూరి చెవుల్లో మార్మ్రోగాయి.

వో వెర్రిబాగులోడా! ఇలా యెళ్ళి



అడిగితే నీకొక్కగింజ కూడా రాదు. నా మాటిని నువ్వూ నీ సెల్లిలా కళ్లల్లో గన్నేరిపాలు ఒడిసేసుకోండి. ఆ కళ్లు కూంతా పోతే కడుపునిండా కూడే.'

* * *

'అన్నా! కళ్లూకాళ్లూ వున్నోడి మీద యెవరికీ కనికారం వుండదు. అందుకే నాకళ్లు యిట్టా పోగొట్టు కుండా. మొదట్లో కూంత బాదగానే వుంటది మరి—' మళ్లీ చెప్పాడు వీరయ్య.

ఆ మాటలు గుర్తుకువచ్చి సూరి అదిరి పడ్డాడు.

'కళ్ళు వుండగానే చూడని యీ మనుషులు ఆ కళ్ళు కాస్తా పోయాక చూస్తారని నమ్మకం యేమిటి? కళ్ళు లేక నారయ్య తాత యెంత బాధపడుతున్నాడో రోజూ చూస్తున్నదే!'

—అనుకుంటూ 'ఆ పసిదాని కళ్ళలోకి చూశాడు సూరి. ఆ కళ్ళు చక్రాల్లా మెరిసిపోతున్నాయి అవి రెండూ పోతే— మరి ఊహించలేకపోయాడు. వాడికి భయం వేసింది

'చెల్లి!' అని చిట్టిని గట్టిగా కౌగిలించుకున్నాడు. చెల్లెలి ముఖానికి దగ్గరగా తన ముఖం పెట్టి దాని కళ్ళలోకి ఆప్యాయంగా చూశాడు.

మిట్టమధ్యాహ్నం అయింది. ఎన్ని వీధులు తిరిగినా అరసోలడు బియ్యంకన్న యెక్కువ రాలేదు. వాడి కళ్ళల్లో నీళ్లు నిండాయి.

'ఎందుకేడుస్తావన్నయ్యా? ఈ బియ్యం ఈ పూటకి సరిపోతాయిగా?'

'మరి రాత్రికో?'

'మనిద్దరం గట్టిగా కౌగలించుకు పడుకుందాం. అప్పుడింక ఆకలెయ్యదు'

'చిట్టీ!' అంటూ చెల్లెల్ని హృదయానికి హత్తుకొని గొల్లుమన్నాడు వాడు వాడి ఏడుపు చూసి చిట్టి కూడా యేడ్చింది

'ఆకలేస్తోందన్నయ్యా!'

సూరికి కడుపు తరుక్కుపోయింది. రాత్రంతా కడుపులో కాళ్ళు పెట్టుకు పడుకోవడంవల్ల అడుగుతీసి అడుగువేసే ఓపిక లేక తోటకూరకాడలా సోలిపోతోంది చిట్టి. ఎదురుగా హోటలు కనిపించింది. వాడి మెదడులో తళుక్కున యేదో వూహ మెదిలింది. చిట్టిని తీసుకుని ఆ హోటల్లోకి వెళ్ళాడు. సర్వరు ఒక ప్లేటు యిడ్లీ తెచ్చి చిట్టి ముందు ఉంచాడు.

'నువ్వు కూడా తిను అన్నయ్యా!'

'నాకు వొద్దు—నువ్వు తిను.'

చిట్టి ప్లేటు ఖాళీ చేసింది. అన్నా చెల్లెలూ లేచి ముందుకు నడిచారు. ఎదురుగా హోటలు యజమాని కూర్చుని వచ్చేవాళ్ళనీ, వెళ్ళేవాళ్ళనీ వెయ్యి కళ్ళతో చూస్తున్నాడు సూరికి భయం వేసింది. డబ్బు లేకుండా టిఫిను తిన్నందుకు ప్రొప్రయిటరు వాడిని ఈ చెంపా ఆ చెంపా గట్టిగా వాయించేశాడు. 'మూసుకోకుండా అడ్డమయినోళ్ళకి టిఫినిస్తావా?' అంటూ కొత్తగా చేరిన సర్వరుమీద విరుచుకుపడ్డాడు. ఉద్రేకంతో ఊగిపోతున్న ప్రొప్రయిటర్ని చూడగానే చిట్టి బెదిరిపోయింది. నిర్దాక్షిణ్యంగా తనని చావగొట్టే తండ్రి దాని కళ్ళలో మెదిలాడు. అది నిలువునా వొణికిపోయింది. హోటలు యజమాని సూరిని రెక్క పట్టుకుని అవతలకు విసిరేశాడు. 'అన్నయ్యా!' అంటూ చిట్టి వాడు వున్నచోటికి ఒక్క గంతు వేసింది. తను దెబ్బలు తిన్నా సరే చిట్టి కడుపు నింపినందుకు వాడు మనసులో సంతోషించాడు.

# విధి వంచితులు

ఆ మధ్యాహ్నం సూరి కాచుకున్న గంజి కాస్తా కుక్క వంచేసింది. తొలి రోజంతా వర్షంలో తడవడంవల్లా, హోటల్లో తిన్న దెబ్బలవల్లా ఒళ్లంతా నొప్పిచేసి రాత్రయే సరికి వాడికి తీవ్రంగా జ్వరం తగిలింది. ఆ మర్నాడు కూడా వాడు లేవలేదు. ఆ రోజు జోలె పుచ్చుకొని నారయ్యతాతతో చిట్టి బయల్దేరింది. బయలుదేరిన వేళా విశేషం యేమిటో— దానికి బియ్యం దండిగానే దొరికాయి. ఇంకొక్క రెండిళ్లు చూసుకొని తిరుగుముఖం పడదామన్నాడు నారయ్య. ఇంతలో రిక్షా తొక్కుతూ దూరంగా నాన్న కనిపించడంతో చిట్టికి పై ప్రాణాలు పైనే యెగసిపోయాయి. అద్ధి నారయ్య చెయ్యి వొదిలించుకొని భయంతో పరుగెత్తింది.

'సిట్టీ! సిట్టెమ్మా!'—నారయ్య ఆదుర్దాగా పిలుస్తున్నాడు. ఆ పిలుపు దానికి వినిపించడంలేదు.

'చిట్టీ! చిట్టీ!' అంటూ రిక్షా తొక్కుతూ వేగంగా వెంటాడుతున్న తండ్రి పిలుపు దాని గుండెల్లోకి దూసుకుపోతోంది.

'చిట్టీ! ఆగు. ఇన్నాళ్ళ నీకోసమే వెతుకుతున్నాను.' అని అరిచాడు నాన్న.

పరుగెడుతున్న చిట్టి తన వేగం యింకా హెచ్చింది.

'అమ్మా! నే నమ్మా! నాన్నని — మీ నాన్నని. భయం లేదు తల్లీ! ఆగు: మీరు యిల్లు విడిచి వొచ్చేసినప్పట్నించి మీకోసమే వెతుకుతున్నాను. అమ్మా! ఆగు.' అంటూ వెంటాడుతున్నాడు నాగభూషణం.

చిట్టికి ఇవేమీ కనిపించటంలేదు. ఏమీ కనిపించటం లేదు. తనని వెంటాడుతున్నది నాన్న కాదు—ఏదో భయంకర స్వరూపాన్ని చూసినట్టు పారిపోతుంది చిట్టి. నాన్నంటే భయం నరనరాలా పట్టేసింది దానికి నాగభూషణం తన దగ్గరకి వస్తున్నకొద్దీ చిట్టికి కాళ్ళు తడబడి యెదురుగా వస్తున్న లారీ క్రిందపడిపోయింది. చూస్తూండగా ఆ పసిదాని ప్రాణాలు అనంతవాయువులలో లీనమై పోయాయి. నాగభూషణం కుప్ప కూలిపోయాడు.

'అమ్మా! తల్లీ! చిట్టీ; నిన్ను నేను చేతులారా చంపేశానమ్మా! చేతులారా చంపుకున్నాను. మీ అమ్మ చావుకి నువ్వే కారణమని నిన్ను వేధించాను. నీ చావుకి నేను కారణమయ్యాను. తల్లి లేని నీకు తండ్రి ప్రేమ కూడా లేకుండా చేశాను. నిన్ను దిక్కులేని దాన్ని చేశానమ్మా! దిక్కులేని దాన్ని చేశాను! ముక్కు పచ్చలారని ఈ వయస్సులో ముష్టిపిల్లగా తయారు చేశాను. నిన్ను గొడ్డుని బాదినట్టు బాదాను. చివరికి నీ చావుకి నేనే కారణమయ్యాను. నన్ను నువ్వు మనస్సులో యెంతగా శపించావో— ఆ శాపమే యిప్పుడు కడుపు శోకమై నన్ను నిలువుగా దహిస్తోంది తల్లీ! దహించేస్తోంది. నేను తండ్రిని కాను— హంతకుణ్ణి. కన్నబిడ్డని చేతులారా చంపుకొన్న కసాయివాణ్ణి — కాదు— కాదు — కసాయివాడు కూడా కన్నబిడ్డని చంపుకోడు. నేను రాక్షసుణ్ణి. తల్లీ! రాక్షసుణ్ణి'— అంటూ తల బాదుకుంటున్నాడు నాగభూషణం.

ఇంతలో 'సిట్టీ! సిట్టెమ్మా!' అని దారి తడుముకుంటూ నారయ్య తాత లారీ దగ్గరకి చేరాడు. అప్పటికే పదిమందీ మూగారు. జరిగినది తెలిసి ఆ అంధుడు నేలమీద కూలబడిపోయాడు. కొంతసేపటికి పోలీసులు వొచ్చి చిట్టిని శవపరీక్షకి తీసుకు పోయారు. ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు—

చిట్టి కోసం తన కంటే కూడా యెక్కువగా యేడుస్తున్న నారయ్యని చూసి 'ఎవరు బాబూ! నువ్వు?' అన్నాడు నాగభూషణం.

'నేను సిట్టికి తాతని నువ్వోరు బాబూ?' —ఆ ముసలిగొంతు వొణికి పోయింది.

నారయ్యతోపాటు నాగభూషణం సంతపాకల దగ్గరకి చేరుకున్నాడు. జ్వరం అంతా ఏమయిపోయిందో యేమో— 'నాన్నా!' అంటూ యెదురుగా వచ్చి తండ్రిని అమాంతం కౌగిలించుకున్నాడు సూరి.

'బాబూ!' అని యేకధారగా యేడ్చాడు ఆ కన్నతండ్రి. ఇంతకాలమూ విడిపోయి నందుకు తండ్రి విలపిస్తున్నాడనుకొన్నాడు కొడుకు.

'చిట్టి యేది తాతా?'—పక్కకి తిరిగి అడిగాడు సూరి. శవంలా అయిపోయాడు నారయ్యతాత.

'బాబూ! చిట్టిని నా పొట్టని పెట్టుకున్నాను రా! నేను తండ్రిని కాను — రాక్షసుణ్ణి' అంటూ గుండె బాదుకుని యేడ్చాడు నాగభూషణం.

సూరి నిర్జీవ ప్రతిమలా అయిపోయాడు. సంతపాకలన్నీ ఒక్కసారి గొల్లుమన్నాయి.

'బాబూ!' అని కొడుకుని పట్టుకొని బావురుమన్నాడు నాగభూషణం. ●

# వారఫలం

**18. 2. 1972 శుక్రవారం మొదలు**
**24. 2. 1972 గురువారం వరకు**

**మేషం:** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం:** విూ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. విూ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిథునం:** వ్యాపారంలో విూ ఆలోచనలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసంతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో విూరు శ్రమకు గురి కాగలరు. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది దైవకార్యాలు నెరవేరతాయి.

**సింహం:** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగ ఉంటాయి. వృత్తిలో విూ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహిత్యకళారంగాల్లో విూ కృషి రాణిస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోదాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** అనవసరమైన శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**తుల:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. విూ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**వృశ్చికం:** వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. ఆడంబరం కొసం వ్యయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో ప్రయాస కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో ప్రయత్నించిన ప్రతిపని సులువుగా నెరవేరుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మకరం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరతాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**కుంభం:** వృత్తి వ్యాపారాల్లో విూ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. విూ ఆలోచనలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మీనం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. వారం ఆఖరులో విూ మంచితనమే విూకు యిబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్



సీరియల్

# గూడు చెదిన పక్షులు

యర్రం చంద్రశేఖరం





### జరిగిన కథ

లక్షాధికారి గారాల ముద్దుబిడ్డ శశిరేఖ. తండ్రి ఆదరంతో తనతోపాటే మెడిసిన్ చదువు తున్న ప్రసాదును ప్రేమిస్తుంది యుద్ధరంగంలో సైనికుల చికిత్సకోసం ప్రసాదు వెళ్ళాడు. విరహంతో తల్లడిల్లుతున్న శశిరేఖను స్నేహితురాలు నాగ ఆమెనయిమ్సుంది వాణికి శశిరేఖ రహస్యమంతా తెలును. అందుకే ఆమెని ఎగతాళి పట్టించింది రేఖ గురించి ఆలోచించుకుంటూంటే ఆమె పెళ్ళిచూపుల తతంగం జ్ఞాపకం వచ్చింది. తలుచుకుని బాధపడ్డాడు ప్రసాద్ రేఖతో తన పెళ్లి నిశ్చయమై పోయిందని తలచుకుని మురిసిపోయాడు సూర్యం ప్రసాద్ తమ్ముడే అతన జబ్బుతో తీసుకుంటూ ఆ హాస్పిటల్ లో జాయినయాడు సూర్యం అన్నగారు దగ్గర లేకపోవడంతో ఏలా చెడిపోయిందీ తలచుకుని బాధపడ్డాడు తండ్రి ప్రసాద్‌ని పోగొట్టుకున్నాక చాలా బాధపడ్డాడు రమణయ్య గత స్మృతులు అతన్ని కలచి వేస్తున్నాయి.

## 10

రాజీ ఆమె మామగారు వాళ్ళ ఊరు వెళ్ళిపోయారు ఇంట్లో కాంత బాబు... నేనే మిగిలిపోయాం. లక్ష్మిని ఎంత మరచిపోవాలని ప్రయత్నం చేసినా వీలుపడలేదు. లక్ష్మికి.. కాంతానికి ఏ విషయంలోనూ సామ్యం లేదు.

పై ఆలోచలన్నీ గుర్తుకు వచ్చి జరిగినదంతా కళ్ళకు కట్టినట్లు తోచింది. మనస్సంతా వికలా వికలమై పోయింది. సూర్యకాంతం నన్ను ఈ స్థితికి తీసుకువచ్చింది ఇల్లు, వాకిలి, పుట్టి, పెరిగిన ఊరు అన్నీ వదిలి ఈ బస్తీలో జీవచ్ఛవంలా జీవించే పరిస్థితి ఏర్పడింది యిప్పుడు. ఎవరిని నిందించి ఏం ప్రయోజనం ...? అంతా స్వయం కృతాపరాధం అయినా నా పిచ్చిగాని విధి ఎంతో బలీయమైనది దాన్ని అధిగమించడానికి నేనెంతటి వాడిని? ఇంకా ఎన్ని బాధలు పడాలో?

'ఏమండీ! భోజనానికి లేవండీ! చాలా ప్రొద్దుపోయింది.'

'ఈ పూట నేను భోజనం చేయను... ఆకలిగా లేదు. నీవు భోంచేసి వెళ్ళి పడుకో! ఈ రాత్రికిక నాకు నిద్ర కూడా పట్టదు .అంతా నా ఖర్మ '

'అదేమిటండీ ..! భోజనం చేయకుంటే ఎలా డాక్టరుగారు ఏం చెప్పారు? వేళకు భోజనం .. నిద్ర చాలా ముఖ్యమని చెప్పలా !.! మీరు భోజనం చేయకుండా నేనెలా భోంచేసేది? జరిగినదానికి నామనసెంతో క్షోభించిపోతూ ఉంది నన్ను యింకా చిత్రహింస పెట్టకండి ... మీకు పుణ్యముంటుంది '

'ఈరోజా యిలా మాట్లాడుతున్నావు.. చేసిందంతా నీవుకదే! అనుభవించు .తప్పుతుందా? నీవు ఉరిపోసుకు చచ్చినా నేను ఈ పూట భోజనం చేయను నా బిడ్డ ప్రసాదు తిన్నాడో . తినలేదో . ఎక్కడున్నాడో ..ఏమవస్థలు పడుతున్నాడో? ఈ రోజేకాదు ..యికముందు కూడా రోజూ ఒక్కపూటే భోంచేస్తాను. కృంగి ... కృశించి ... మరణిస్తాను. నా నేరాని కదే శిక్ష '

'మీరలా అంటే నాగతేం కావాలి చెప్పండి? అయినా యిందులో మీ తప్పేముంది? తప్పంతా నాది ... నే చేసుకున్న ఖర్మ ! అనుభవిస్తున్నాను ... అనుభవిస్తాను ఆ బాబుకు అన్యాయం చేసినందుకు కన్నకొడుకుకు దూరమయ్యాను '

కంట తడిపెడుతూ కొంగుచాపుకొని పడుకుంది కాంతం నాకు దానిపై ఏ మాత్రం జాలికలగలేదు పైగా చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది .. మెల్లగా ఆ కోపాన్ని దిగమింగి నిద్రపోవడానికి ప్రయత్నించాను . నిద్రపడతుందా? ఎలా పడుతుంది ...? నా లక్ష్మి .. నా బిడ్డడు ప్రసాదు .. వారిని గురించిన ఆలోచనలు నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. భోజనం చేయకపోవడం . నాకు తగిన శిక్షగా భావించాను . ఎప్పుడో తెల్లవారుఝామున కళ్ళుమూశాను .. గాఢంగా నిద్ర పట్టింది

* * *

ఆలోచనలు అతి కావడం వల్ల మళ్ళీ నా ఆరోగ్యం దిగజారింది ఒకరోజు పడక కుర్చీలో కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నాను అప్పుడే డాక్టరుగారు నన్ను పరీక్ష చేసి వసారా లోపలికి వెళ్ళారు. కాంతం వారిని అనుసరించింది

'డాక్టరుగారూ ...! పరిస్థితి ఎలా ఉంది...?'

'ఏం చెప్పమంటారు...? వారి ఆరోగ్యం చాలా వరకు కుదుటపడిందని ఎంతగానో సంతోషించాను ... మొన్నటి వారం వచ్చి చూసినప్పుడు బాగానే ఉన్నారు...జబ్బు ఈ వారంలో తిరగబెట్టడం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంది. రక్తపోటు మళ్ళీ ఎక్కువైంది. దగ్గు, ఆయాసం కూడా బాగా ఎక్కువగా వస్తూ ఉన్నట్లుంది. మీరు నావద్ద ఏదో విషయాన్ని దాస్తున్నారు. వారు ఏదో విషయాన్ని గురించి మనసులో ఎంతో బాధపడుతున్నారు. ఇలా అవుతే నా వైద్యం ఎందుకూ కొరగాదు. రక్తపోటు ఉన్నవారు ఎక్కువగా ఆలోచించ కూడదు. నేచెప్పినట్లుగా ఆహారం, నిద్ర ఏవేళకవి అమురుతూ ఉన్నాయా?'

'ఏం చెప్పమంటారండీ..? అంతా నా ఖర్మ ... వారం రోజులనుండీ నాపై కోపంతో ఒకపూట భోజనం మానేశారు ... ఏవేవో ఆలోచనలతో రాత్రిళ్లు సరిగా నిద్రపోవడంలేదు... దయచేసి మీరే వారికి నచ్చచెప్పాలి... నా మాటలు అసలు వారు లెక్కచేయడంలేదు.'

'ఇలా అవుతే నేనిచ్చే మందులింకేం పనిచేస్తాయి? ఈ సంగతి యిందాకే ఎందుకు చెప్పలేదు ... వారితో మాట్లాడి ప్రయత్నిస్తాను.' కాంతంతో ఆ మాటలని మళ్ళీ నా దగ్గరకువచ్చి ప్రక్కనే ఉన్న స్టూలుమీద కూర్చున్నారు. నా ముఖం లోకి జాలిపడుతూ చూస్తూ 'చూడండి రమణయ్యగారూ...! మీ బాధ ఏమిటో నా కర్థం కావడంలేదు డాక్టరుగా మీ శరీరంలోఉన్న రుగ్మతను మాత్రం నయం చేయగలను ... కాని మీ మానసికబాధకు వైద్యం చేయలేను ... మీరు మానసికంగా కూడా కృంగిపోతున్నట్లు యిప్పుడే తెలిసింది ... మీరు ఎక్కువగా ఆలోచించ కూడదు. మీ మనసులో మెదులుతున్న బాధలను ఆప్తులనుకున్నవారికి చెప్పండి... కొంత హృదయభారం తగ్గుతుంది అసలు మీరు మానసికంగా ఎందుకు బాధపడవలసి వచ్చిందో నా కర్థం కావడంలేదు ... మిమ్మల్నిచూస్తే ఆస్తిపాస్తులు బాగా ఉన్నవారిలా కనుపిస్తున్నారు ... మరే విషయంలో దిగులుపడుతున్నారు...? ఇంత కాలంగా మీకు నేను వైద్యం చేస్తున్నాను ... కాని మీస్వవిషయాలను అడిగి తెలుసుకోవాలనే కాంక్ష నాకు కలగలేదు... మీరు రాత్రింబవళ్లూ ఆలోచిస్తూ నిద్ర కూడా పోవడంలేదని కాంతమ్మగారు చెబుతున్నారు ... ఆలోచనలు మీ శరీరానికి మంచివి కావు. సంగతేమిటో తెలుసుకోవాలని కాంక్ష కూడా కలుగుతూ ఉంది'

'అలాగే డాక్టర్! ఈ బస్తీలో మిమ్మలను మించిన ఆప్తులు మా కెవరున్నారు? తప్పకుండా చెబుతాను ... కాని యిప్పుడు కాదు...ఆ ఓపిక లేదు'

'సరే...! మీకు వోపిక ఉన్నప్పుడే చెబుదురుగాని ... నాకుమాత్రం మాటివ్వాలి; ఎక్కువగా ఆలోచించననీ, వేళకు భోజనం చేస్తాననీ...'



'భోజనం...ఎలా భోంచేయాలి డాక్టర్! నిర్దోషియైన కుమారుణ్ణి దూరం చేసుకున్నాను ... కసాయివానిలా ప్రవర్తించి యింటినుండి తరిమేశాను...వాడు ఏస్థితిలో ఉన్నాడో ... కడుపునిండా తింటున్నాడో లేదో...? పస్తులుండడమే నాకు శిక్ష... ఇక ఆలోచనలంటారా...? అవి ఎలాగూ తప్పవు...'

'మీ మాటలవల్ల మీరు మీ కుమారుణ్ణి యింటినుండి తరిమేసినట్లు అర్థమౌతూ ఉంది...త్వరపడి, ఆవేశంలో, అనవసరంగా వెళ్ళగొట్టినట్లు మీరు యిప్పుడు బాధపడుతున్నారు... అంటే... మీరు చేసింది తప్పని తెలుసుకున్నారు ... పశ్చాత్తాపమే తుడిచివేసింది ... మరొక విషయం... ! మీనుండి దూరమైన ఆ మీ కుమారుణ్ణి చూడాలని మీకుందా...?'

'అదేం మాటండీ...! వాడికోసరం తహ తహ లాడిపోతున్నాను... ఎక్కడున్నాడో...? ఎన్ని యిబ్బందులు పడుతున్నాడో ...? ఉత్త అమాయకుడు...చనిపోయేలోగా వాణ్ణి చూడాలి... వాడిపట్ల నే చేసిన ద్రోహానికి క్షమాపణ కోరుకోవాలి...అప్పుడే నిశ్చింత.'

'ఎక్కడున్నాడో తెలుసా మీకు...?'

'తెలియదు ... అది తెలిస్తే లేని దేముంది...?'

'ఈ విధంగా మీరు క్షీణించిపోతూ ఉంటే, ఎంతకాలం జీవించి ఉండగలరు...? చాలా కొద్ది కాలం మాత్రమే! మరి మీ మాటలను బట్టి ... జీవించాలని కోరిక ఉన్నట్లు వెల్లడౌతూ ఉంది. మీకు మీ అబ్బాయి కనుపించాలి...అతనిని మీరు క్షమాపణ కోరుకోవాలి...అందుకై మీరు తప్పకుండా జీవించి ఉండాలి...ఏమంటారు...?'

'అవునండీ...! పొరపడ్డాను నాబాబుని చూడడానికైనా నేను జీవించి ఉండాలి. ఇప్పుడు. ఈ ఆలోచన నాకు తట్టలేదు. జీవించాలి...జీవిస్తాను. కొనఊపిరిలోనైనా జీవించి ఉండాలి ... జీవించడానికి సరిపడే ఆహారాన్ని మాత్రమే తీసుకుంటాను ... ఆరోగ్యం కాపాడుకుంటాను. నిజంగా మీరు నా కళ్ళు తెరిపించారు...' అలసటతో కళ్ళు మూశాను. డాక్టరుగారు వెళ్ళిపోతున్న చప్పుడు వినిపించింది.

* * *

# గూడుచేరిన పక్షులు

వారం పదిరోజులు గడిచిపోయాయి ఆలోచనలు తగ్గించుకున్నాను ఆహారం సవ్యంగా తీసుకుంటున్నాను. ఆరోగ్యం మళ్ళీ కొద్దిగా కుదుటపడినట్లనిపించింది. భోజనం చేసి విశ్రాంతిగా పేపరు చదువుతూ కూర్చున్నాను, 'సరిహద్దు ప్రాంతాలలో మన డాక్టర్ల కృషి' అనే శీర్షిక క్రింద ఒక పూర్తికాలం అచ్చు కాబడి ఉంది. అదంతా చదివాను.. దీర్ఘంగా నిట్టూర్చాను. ప్రసాదును డాక్టరుగా చేస్తానని లక్ష్మికి చేసిన వాగ్దానం గుర్తుకు వచ్చింది... బాధ పడ్డాను. 'లక్ష్మీ... నేను నీకిచ్చిన మాట నిలబెట్టుకోలేక పోయాను. నన్ను మన్నించవూ...నా మాటలు వినకుండా రెండవ పెళ్ళికి బలవంతం చేశావు. దాని ఫలితం చూడు...కాంతం కారణంగా నీకిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకో లేక పోయాను...' మళ్ళీ నా ఆలోచనలు గతంలోకి పరుగెత్తాయి.

రాజీ మా యింటి నుండి వెళ్ళిపోయిన తర్వాత సంసార బాధ్యతల్నీ కాంతం పై పడ్డాయి. బాబుని ప్రేమగానే చూసుకుంటూ ఉండేది. ఆ విషయంలో నాకు ఎటువంటి అనుమానమూ కలుగలేదు. బాబు విషయంలో కాంతం ప్రవర్తనను ఆమె లేని సమయాలలో పనిమనుషులను, జీతగాళ్లను అడిగి తెలుసుకొని, తృప్తికరమైన సమాధానాలను పొందుతూ ఉండడం వలన నిశ్చింతగా గడపసాగాను సంతోషపడ్డాను కూడా! కాంతం లక్ష్మిలా నన్ను సుఖపెట్టలేక పోయినా బాబుని ఆప్యాయంగా చూస్తే చాలనీ, ఆ ఆప్యాయత బాబుపై చిరకాలం అలాగే ఉండేలా చేయవలసిందనీ, భగవంతుడిని ప్రార్థిస్తూ ఉండేవాడిని.

ఒకసారి బాబును చూసిపోవాలనే ఉద్దేశ్యంతో రాజీ మా యింటికి వచ్చింది. ఆ విధంగా రెండు మూడు నెలలకొకసారివస్తూ ఉండేది. ఆమె వచ్చిన వారం రోజులలోనే కాంతం గర్భిణి అన్న విషయం నాకు తెలిసింది...నాలో మరొక సమస్య తలెత్తింది. ...కాంతానికి పిల్లలు కలిగితే బాబుని సరిగా చూస్తుందా...? ఏమో...? అంతా ఆ ఏడుకొండలవాడి దయ ... భారమంతా అతనిపై వేశాను.

కాంతం కూడా మగపిల్లవాడినే ప్రసవించింది...బారసాలకు కాంతం తలిదండ్రులు, రాజీ...తదితర ముఖ్య బంధువులు వచ్చారు. బారసాల ముగిసిన తర్వాత అంతా వెళ్ళిపోయారు. కాంతం చంటిపిల్ల తల్లి కాబట్టి బలవంతంచేసి రాజీని ఒకటి రెండు మాసాలు యింట్లో ఉంచుకున్నాను. ఆమె వెళ్ళిపోయేటప్పుడు 'అన్నయ్యా! బాబును జాగ్రత్తగా చూసుకో! మునుపటిలా ఒదినపై నమ్మకం పెట్టుకోకు...యిప్పుడామె పరిస్థితి గోడమీది పిల్లివాటంలా ఉంటుంది ...అనుభవంమీద చెబుతున్నాను. ప్రసాద్‌ను ఒకటికి రెండుసార్లు కసిరించిపారవేయడం, అనవసరంగా వాడి చెవులు మెలివేయడం గమనించాను, నేను కనపడేసరికి మాట మార్చి ఎక్కడలేని ప్రేమ కనబర్చింది వాడిపై...ఏమో అన్నయ్యా...!లక్ష్మి వదిన గుర్తుకు వచ్చినప్పుడల్లా బాబు పరిస్థితి వాడి...భవిష్యత్తు ఏమౌతుందోనన్న భయం నన్ను పీడిస్తూ ఉంటుంది.

'ఒక్క విషయం నీకు నొక్కి చెబుతున్నాను...వాడు మీకు బరువని తోచినప్పుడు నేను వచ్చి తీసుకువెడతాను... వాణ్ణి మాత్రం అన్యాయం చేయవద్దు. ఇలా అంటున్నందుకు నన్ను అపార్థం చేసుకోవద్దు...నేను లక్ష్మి ఒదినకు మాట ఇచ్చాను'

'అదేమిటమ్మా అటువంటి పరిస్థితి రానిస్తానా...?'

'అలాగవుతే బెంగే లేదు'

నాకు యిప్పుడు అర్థమౌతూ ఉంది. కాంతం ఎంత చాకచక్యంగా నటించి ప్రసాద్‌ను నాచేత వెళ్ళగొట్టించిందో ..? నేను యింట్లో ఉన్నప్పుడు, నాపై అవి మానంగల వ్యక్తులముందు ప్రసాదుపై ఎంతో ప్రేమ ఉన్నట్లు నటించేది...మనసులో బాబును ద్వేషించేదేమో? అనుమానమెందుకు...? ద్వేషించింది...ఆ తియ్యటి మాటలు ... ఆ పొగడ్తలు. చిన్నవాడు నూర్యాప్పి చెప్పరూ...ఏడుస్తూ...నాముందు ప్రసాదును పొగుడుతూ ఉండేది.

మరికొంతకాలం గడిచింది పిల్లలిద్దరూ స్కూలుకు వెళ్ళడమారంభించారు. ప్రసాదు వచ్చి తల్లి పోలికలే...! వాణ్ణి చూసినప్పుడల్లా నా లక్ష్మి గుర్తుకువస్తూ ఉండేది. చదువులో అందరికన్న ముందుండేవాడు.

ఇవాళ-జానకి ఇంటి పనంతా ముగించు కొని అమ్మగారింటికి వెళ్ళి వచ్చేటప్పుడు బజారుకు కూడా వెళ్ళి వచ్చింది ఇప్పుడు-కొడుకు రాజన్‌తో ఆడే సమయం.



# "ఎన్ని చెప్పండి హార్లిక్స్ పుష్టే పుష్టి"

## అంటుంది జానకి

పూర్తి మీగడగల పాలు మరియు పచ్చగా పండిన గోధుమలలో గల మాంసకృత్తుల సారంతో మంచి సత్తువ నిచ్చేది హార్లిక్స్.

హార్లిక్స్ ఏరోజు కారోజు ఆహారంలో లోపించిన సత్తువలను పూరించి అదనపు శక్తిని, బలాన్ని చేకూర్చుతుంది.

తల్లులు హార్లిక్స్‌నే నమ్ముతున్నారు. మరియు డాక్టర్లు 80 సంవత్సరాలకు పైగా దీనిని సిఫారసు చేస్తున్నారు.

హార్లిక్స్ త్రాగండి. అది మంచి పుష్టికరమైనది యదార్థమైన పుష్టిని, అదనపు శక్తిని మీకు చేకూర్చుతుంది.




## 'హార్లిక్స్'- మంచి పుష్టికరమైనది

రిజిష్టర్ కావింప బడిన ట్రేడ్ మార్కు.

HL-2916 A

ఊరిలో పిల్లలవద్ద... పెద్దలవద్ద మంచి పేరు తెచ్చుకున్నాడు వాడు. వాడిపై ప్రేమ ఉన్నట్లుగా నటిస్తూనే వాడిని నాకు దూరం చేసింది లేనిపోని దొంగతనాలు వాడికి అంటగట్టేది...చెడ్డపనులు చేస్తున్నాడనీ, చెడు మాటలు మాట్లాడుతున్నాడనీ చాడీలు చెప్పేది... మొదట్లో నేను నమ్మలేదు. వాడు చెడిపోతున్నాడని కంట నీరు పెట్టుకోవడం కూడా ప్రారంభించింది చివరకు. పైగా నేను జాగ్రత్తపడకపోతే పరలోకంలో ఉన్న తన అక్కయ్య మనసు క్షోభించి పోతుందనీ, కల్లిబొల్లి కబుర్లు చెప్పేది. అంతపట్టుదలతో చెబుతూ ఉండడంవల్ల నిజమని నమ్మేపరిస్థితికి వచ్చాను నేను.

ఈ విషయాలిలా ఉండగా చాలాకాలం తర్వాత రాజీ మాయింటికి వచ్చింది... ఆమెను మంచి చేసుకొని కొన్నికొన్ని సందర్భాలలో ఆమెను కూడా నమ్మించింది; ప్రసాదు చెడిపోతున్నాడని. తల్లిలేని పిల్లవాడనీ, చిన్నతనం కావడంవల్ల అలా తుంటరిపనులు చేస్తున్నాడని సర్దిచెప్పి, ఉన్న కొన్నిరోజులూ వాడిని ఆప్యాయంగా చూసి వెళ్ళిపోయింది.

చివరకు కాంతం నామనసు పూర్తిగా చెడగొట్టింది. ప్రసాద్‌ను ద్వేషించడం... వాడు కనుపించినప్పుడల్లా చీరాకుపడడం వరకు వచ్చింది నా పరిస్థితి...వాడు మ్యాట్రిక్ ఫైనల వరకు వచ్చాడు. ఎన్నడూ లేనిది ఆ సంవత్సరం వాడిపై ఒకటికి

# గూడుచేరిన పక్షులు

నాలుగుసార్లు చేయిచేసుకున్నాను. పూర్వం వాడిని చూడందే ఏమీతోచేదికాదు. కాని యిప్పుడు వాడు కనుపిస్తే వళ్ళంతా తేళ్ళు జెర్రులు పాకేవిధంగా తయారయ్యాను. నన్ను అలా తయారుచేసింది కాంతం... నేను ప్రసాద్‌ను తిట్టినప్పుడు... కొట్టినప్పుడు తను వాణ్ణి వెనకేసుకు వచ్చేది, లాలించేది, బుజ్జగించేది, వాడి బాగోగులను తను ఒక్కర్తే చూస్తున్నట్లుగా ప్రవర్తించేది ఆ నటనతో ఆమె చెబుతున్నదంతా నిజమేననీ, వాడి మంచికోసరమే, తాపత్రయ పడుతూఉందనీ మూర్ఖంగా నమ్మాను... సర్వనాశనం జరిగిపోయింది...ఆ గ్రుడ్డినమ్మకమే నాబిడ్డడిని నాకు దూరం చేసింది ... జరగకూడని అనర్థం జరిగిపోయింది.

ఆరోజు జరిగిన సంఘటన... అబ్బ... ఎంత పైశాచిక ప్రవర్తన. నా జీవితంలో మొట్టమొదటిసారిగా అలా ప్రవర్తించాను. ఊరినుండి తిరిగిరాగానే బీరువాలో నే పెట్టిన వందరూపాయలనోటు కనుపించలేదు. ఇంటాబయటా ప్రసాదుపై చాడీలు... నోటుపోయిందన్న కోపంతోకాదు ...చెడిపోతున్నాడన్న కోపంతో కొట్టాను ...వెళ్ళగొట్టాను ... బుద్ధి తెచ్చుకొని భయంతో మసులుకుంటాడని ... తను తీసినట్లు ఒప్పుకున్నట్లయితే పేచీ ఉండేది కాదు. రామయ్యతో తను ఆనోటు తీయలేదని కబురు పంపించాడు ... దాంతో నా అనుమానం మరీ బలపడింది... నా ముందు చెప్పకుండా మధ్యవర్తితో మంతనాలు జరిపించినందుకు అగ్గిబుగ్గయిపోయాను... నాలో అంత మొండిపట్టుదల... ఆవేశం... ఎలా ప్రవేశించాయో... ఏమో...? పాపం వాడు ఊరిలో ఉన్నంతకాలం నా పట్టుదల ...బింకం సడలనేలేదు. వాడు ఊరు ఒదలి వెళ్ళిపోయాడని తెలిసినతర్వాత నా గాంభీర్యమంతా సడలిపోయింది. తప్పు జరిగిందేమోనని అనుమానపడ్డాను ... కాని వాడు ఆ దొంగతనం చేశాడనే నమ్మకమ్మాత్రం నన్ను ఒదలలేదు. అంత చక్కగా... నేను నమ్మే విధంగా ప్లాను ప్రకారం జరిపించింది కాంతం. వాడు ఊరినుండి వెళ్ళిపోయాక 2, 3 వారాలకు ఈ సంగతి చెల్లెలు రాజీకి తెలిసింది ... వెంటనే పరుగెత్తుకు వచ్చింది అపరిమితమైన కోపంతో యింట్లో కాలు పెడుతూనే నాతో పోట్లాట ప్రారంభించింది.

'అన్నయ్యా ... నా అనుమానాన్ని నిజం చేశావ్!... వాడినలా చిత్రహింసకు గురిచేసి యింటినుండి వెళ్ళగొట్టడానికి నీకు చేతులెలా వచ్చాయి? దీని వెనుక ఎవరి నటన... ఎవరి పట్టుదల ఎంతవరకు ఉందో నాకు తెలుసు ... అయినా వాడిని యింటినుండి వెళ్ళగొట్టేముందు నాకు ఎందుకు తెలియజేయలేదు... ? నీకు నేను ఆనాడే చెప్పాను ... వాడు మీకు బరువైతే నేను తీసుకువెడతానని...ఆనాడు తీయని కబుర్లు చెప్పావ్...! ఈనాడేం చేశావు? చేసిన దానికి నాలుగురెట్లు అనుభవిస్తావు ... నీ ముఖం కూడా నాకు చూడ బుద్ధి కావడం లేదన్నయ్యా! పెద్ద ఒదినకిచ్చిన మాట తప్పావు: ఆమె సంతానానికి ద్రోహం చేశావు. నీ యింట్లో పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టను. వాడిని వెదికించేందుకు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను ... అదృష్టముంటే దొరుకతాడు. లేకపోతే నా వాగ్దానం కూడా నీ కారణంగానే కొరగాకుండా పోతుంది.'

నాకు మాట్లాడే అవకాశం యివ్వకుండానే విసవిసా నడుస్తూ వెళ్ళిపోయింది. నేను కూడా వెనుకకు పిలవలేదు ... నాకు మాత్రం అభిమానం తక్కువా? ఆతర్వాత ఆమె పాలేరు రామయ్యను సంప్రదించి



ప్రసాద్‌ను గురించి వివరాలు అడిగి తెలుసుకొని వెళ్ళిపోయిందట! ప్రసాద్‌ను వెతికించడానికి ఆమె చేసిన ప్రయత్నాలుకూడా విఫలమయ్యాయని నాకు ఆ తర్వాత తెలిసింది.

ఆ తర్వాత కొంతకాలానికి ఆ విషయం అందరమూ మరిచిపోయాము. అప్పుడప్పుడు మనసులో మెదులుతూ ఉండేది ... బింకంతో వాడు దొంగని మనసులోనే అసహ్యించుకొనేవాణ్ని ... ఊరిలో పేరు ప్రతిష్ఠలు చెడగొట్టాడు చిన్నవాడు. దొంగగా పేరు తెచ్చుకొని ఎటో వెళ్ళిపోయాడు పెద్దవాడు ఇక అక్కడ ఉంటే ఆ జ్ఞాపకాలు మనసులో మెదుల్తూ చీకాకు పరుస్తాయని, తెలిసినవాళ్ళు ఊరికే అడుగుతూ ఉంటారనీ, నా వ్యాధికి అక్కడ సరైన వైద్యం అమరదనీ ఆలోచించి పట్నంలో కిరాయకు ఒకయిల్లు తీసుకొని ఖర్చుకుకూడా వెనకాడకుండా జీవితశేషమంతా యిక్కడే గడపడానికి నిశ్చయించుకున్నాను. ఆ భగవంతుడి దయవల్ల డబ్బుకు కొరతలేదు. ఇంటినుండి తీసుకు వచ్చిన డబ్బు నాకు నా జీవితాంతం సరిపోతుంది.

కాంతం ఆరోజు విషయాలన్నీ విడమర్చి చెప్పేంతవరకు నాకు ప్రసాదుపై కలిగిన అపోహ తీరనేలేదు. యదార్థం తెలిసినప్పటినుండీ చేసినదానికి బాధపడుతున్నాను. ఇప్పుడిక ఎంత బాధపడినా ... తలబాదుకున్నా ఫలితమేముంటుంది? నా కన్నబిడ్డడు నాకు దూరమై పది సంవత్సరాలు గడిచాయి. అవును...గత జన్మలో ఏ తల్లినుండో బిడ్డను వేరుచేశాను. దాని ఫలితమే యిది...! ఈ మొండిబతుకు యింకెంతకాలం సాగించాలో ఏమో? ... నాలు కుర్చీలో వెనుకకు వాలి నీరసంతో నిట్టూర్చాను.

'ఏమండీ రమణయ్యగారూ ... ఎక్కువగా ఆలోచించవద్దని నాకు మాటిచ్చి ఏదో దీర్ఘాలోచనలో పడినట్లున్నారే?'

'ఏమీ లేదండీ ... ఎంత కాదనుకున్నా పాత జ్ఞాపకాలు గుర్తుకు వస్తున్నాయి మీరు హెచ్చరించిన తర్వాత ఎక్కువగా ఆలోచించడం లేదు. మీకు అన్ని విషయాలూ ఈరోజే చెబుతాను ... ఈరోజు మీకు తీరికగా ఉంటుందా...?'

# ఫ్రిల్ ఫ్రాక్

అన్ని ఫ్రాకుల్లోకి ఫ్రిల్‌ఫ్రాక్ చాలా ప్రత్యేకత కలది. దీన్ని తయారు చెయ్యటానికి కొంచెం ఓపిక అవసరం. తడబాటు పనికిరాదు. కొంచెం వ్యవధి తీసుకుని తయారు చెయ్యటానికుపక్రమించాలి

6 లేక 7 సంవత్సరాల పాపాయికి సరిపడే ఫ్రాకు కొలతలివ్వబడినవి. అనగా 20 అంగుళాల ఫ్రాకన్నమాట' ఫ్రిల్‌కి (కుచ్చుల ఫ్రాకన్న మాట) రెట్టింపు బట్ట పట్టే అవకాశమున్నది· కాబట్టి ఒకటిన్నర మీటరు చక్కటి నైలాన్ శాటిన్‌గాని, లేదా బొంబేడయింగ్ సాదా రంగులుగాని యెన్నుకోవాలి బొంబే డయింగులో అయితే చాలా రంగులు దొరుకుతున్నాయి.

75 సెంటిమీటర్ల బట్టని $1\frac{1}{2}$ అంగుళాల వెడల్పు చొప్పున రిబ్బన్లలా ఎందుకుని ముక్కలుగా కత్తిరించుకుని వాటిని అందుబాటులో వున్న జిగ్‌జాగ్ మిషనుకు ఇస్తే వారి దగ్గర రెండువయిపులా వంకీ అంచులు కుట్టిమ్మనిచెప్తే కుట్టిస్తారు లేదా సింగరుమిషనున్న వారికి(పాత సింగరందోయ్) ఈ ఒంకీ అంచులు కుట్టే పరికరమొకటువున్నది. దాన్ని మార్చుకుని ఈ అంచులు మడుపులు చెయ్యవచ్చు వీటన్నిటిని ఒకే పొడవుగా అతికి రెండు వయిపులా రెండు చేతుల వేళ్ళతో నొక్కిపెట్టి దగ్గరగా జరుపుకుంటూపోతే (గేదరింగ్ అంటారు దీన్ని) ఇలా మెషిన్ నడుస్తుండగానే జరగాలి. అదంతా కుచ్చులతోరణంగా తయారవుతుంది. $8\frac{1}{2}$ అంగుళాల పొడవున్న ఫ్రాక్ స్కర్ట్‌ని $6\frac{1}{2}$ అంగుళాల పొడవే అనుకుని మిగిలినది మడతలోకి ఎంచుకుని ఈ కుచ్చులతోరణాన్ని 36 అంగుళాల చొప్పున ముక్కలు కత్తిరించుకుని ఈ స్కర్ట్‌కి రెండిండి మంచివయిపులా క్రమపద్ధతిలో పేర్చుకుని అతుక్కురావాలి· ఇది బరువుగా అందంగా తయారవుతుంది. ఈ జిగ్‌జాగ్ అంచులు కట్టించేటప్పుడు జరీలో ముఖ్యంగా తెలుపే తయారించాలన్నది మరవిపోరాదు. ఇక. బాడీ. ఇది. 14—పొడవులో 28 అంగుళాల వెడల్పులో వస్తుంది. 'ఎ' బొమ్మలో మాదిరి. ఎదుటి భాగం. 'బి' బొమ్మ మాదిరి వెనుకభాగం తయారు చేసుకుంటే చాలు. కుట్టే పద్ధతి మామూల్లుగా పైపింగ్ వేసుకుని లేపింగ్ లా వేసుకుని దానిని చివరకు కుచ్చులుకట్టి ముడివేసి కుచ్చులు కొవ ప్రక్కగ ప్రక్కగా అతుక్కుంటే చాలు. లాపింగ్‌బవుని క్రాసు ముక్కలతికి రాంగ్‌సైడునుండి జంటగా మడుచుకుని పొడవుగా కుట్టుకోవాలి. సూది దారం సహాయంతో దాన్ని తిరగేసి లా మాదిరి అతుక్కుంటే చాలు. ఇది ఫ్రిల్‌ఫ్రాక్—కావాలనుకుంటే బాడీకూడా ఫ్రిల్ వేయవచ్చును.

—కృష్ణప్రియ




## గూడుచేరినపక్షులు

'ఓ ... అలాగే! ఈరోజు ఆదివారం కదండీ! ఎలాగూ సాయంత్రం పూట ఆస్పత్రికి శలవు. కానివ్వండి. మీ మనసులోని ఆవేదన మరొకరికి చెప్పుకుంటే మీ హృదయ భారం కొంత తగ్గుతుంది.' అన్నారు డాక్టరుగారు.

మొదలుపెట్టాను... లక్ష్మి నా జీవితంలో ప్రవేశించినది మొదలు ... యిప్పటివరకు జరిగిన విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పాను.

డాక్టరుగారు ఓపికతో అంతా విన్నారు. దీర్ఘంగా నిట్టూరుస్తూ 'దయచేసి పెరు మీ ప్రసాదు పోలికలు చెప్పాలి.'

'ఎందుకండీ! వాడు కనుపిస్తాడన్న ఆశ రోజు, రోజుకు సన్నగిల్లిపోతూ ఉంది. ముమ్మూర్తులా వాడివన్నీ వాడె తల్లి పోలికలే! ఎరగా ... బలిష్ఠంగా కళగల ముఖంతో తీర్చి దిద్దినట్లుంటాడు. ఎటువంటి కఠిన హృదయం గల వారినైనా తన మాటలతో ఐదునిముషాలలో కరిగించ గలిగే స్వభావం కలవాడు. నా ఖర్మకాలి, చేతులారా వాణ్ణి యింటి నుండి తరిమేసాను నిర్దాక్షిణ్యంతో. వాడినొక గొప్ప డాక్టరుగా చేస్తానని...నా లక్ష్మి కిచ్చిన వాగ్దానాన్ని వమ్ము చేశాను...యిలా...తయారయ్యాను చివరకు...'

'మీరు చెప్పిన లక్షణాలున్న డాక్టరొకరున్నారిక్కడ ... నా స్నేహితుడైన డా. విశ్వంగారి రేఖా నర్సింగ్‌హోంలో పనిచేసేవాడు... ప్రస్తుతం సరిహద్దు ప్రాంతాలలో ఉన్నాడు డా విశ్వంగారి యింట్లో ఉండే చదువుకున్నాడు...అతని పేరు కూడా ప్రసాదే! నాకన్న పెద్ద చదువే చదివాడు. నా స్నేహితుడు డా. విశ్వంగారి కుమార్తెనే యిచ్చి వివాహం జరిపే నిర్ణయం కూడా జరిగింది... చాలా తెలివైనవాడు ... ఎటువంటి గడ్డు కేసులనైనా చురుకుగా పరిశీలించి తగిన సలహాలి నివ్వడంలో చెయి తేరిన వాడని అంతా అనుకుంటూ ఉండగా విన్నాను ప్రత్యక్షంగా అతనితో పరిచయం ఏర్పడలేదు ... చూస్తే మా తం వినయ విధేయతలు గల యువకునిలాగే కనుపించాడు ... బహుశా అతను మీ ప్రసాదేనేమో...? కాకపోవచ్చు కూడా...! నిన్న

రణగా ఎలా చెప్పగలము? అయినా వీలు చూసుకొని ఒకసారి నా స్నేహితుని యింటికి వెడదాం ... మీరు మాత్రం ధైర్యంగా ఉండాలి...ప్రసాద్ మీకు కను పించాడనే ధైర్యంతోటే మెలగాలి. డా. విశ్వంగారి యింట్లో...మీకు పూర్తి వివ రాలు తెలుస్తాయి.'

నాకు బ్రహ్మానందం కలిగింది. నిర్ధా రణ జరగకముందే ఆ ప్రసాదు నా బిడ్డ ఉన్నట్లుగా అనుభూతి కలుగసాగింది. ఆ తృప్తి, ఆ అనుభూతి నాకు వేయి ఏను గుల బలాన్నిచ్చింది.

డాక్టరుగారు నా ముఖంలోకి పరిశీలనగా చూస్తూ 'అమాకీ తెలిసేసరికే మీరు ఎంతో బలాన్ని పుంజుకున్నారు...ఆ ప్రసాదే మీ బిడ్డడౌతే మీకు పట్టపగ్గాలుంటాయా?'

'మీ నోటి చలువవల్ల అలాగే జరగ నివ్వండి డాక్టర్! మీ ఈ సహకారానికి జన్మాంతం ఋణపడి ఉంటాను ... మరి డా. విశ్వంగారి యింటికి ఎప్పుడు వెడదా మంటారు? నా మనసు నిలవడం లేదు... పట్టరాని సంతోషంగా ఉంది.'

'చూడండి రమణయ్యగారూ! ఇప్పటి మీ పరిస్థితి ఎక్కువ సంతోషాన్ని కూడా భరించలేదు...అయినా అతను మీవాడు కాక పోతే ఈ ఉత్సాహమంతా మాయమౌతుంది. ...దయచేసి ఉద్రేకాన్ని తగ్గించుకోండి. డా. విశ్వంగారు వారి కుమార్తెతో సహా తిరుపతి వెళ్లారు. వారు తిరిగి రాగానే మిమ్మల్లను వారి దగ్గరకు తీసుకు వెడతాను ...నేనిక శలవు తీసుకుంటాను ... చాలా సమయం గడిచిపోయింది...'

డాక్టరుగారు వెళ్ళిపోయారు. తాత్కా లికంగానైనా నా హృదయం సంతోషంతో పొంగిపోయింది. ఆ ప్రసాదే నా ప్రసాదు కావాలని అలా జరిగితే తిరుపతిలో ఏడు కొండలవానికి అతి వైభవంగా కళ్యాణం జరిపిస్తానని మనసులో మొక్కుకున్నాను.

(ఇంకా ఉంది)

# తారకనామం-ధర్మపథం



— బులుసు వేంకటరమణయ్య

'తారకనామ! దశరథనామ!' అని జనసామాన్యం శ్రీ రామనామమే తరింప జేసేదని, దాన్నే ఉచ్చరిస్తూ ఉండడం అందరికీ తెలుసు, భగవంతునికి వహ స్రాలకొద్దీ నామములు ఉన్నా, రామ నామానికే ప్రాధాన్యం ఇవ్వబడింది. రామ కోటిని వ్రాసినట్లుగా మరే నామకోటినీ ఎవ్వరూ వ్రాసినట్లుగాని, వ్రాస్తున్నట్లు గాని ప్రసిద్ధిలేదు.

రామనామానికి ఇంత ప్రాధాన్యం ఉండ డానికి కారణం ఏమిటో తెలుసుకోవడం అవసరంగదా!

శివ, కేశవులకు సంబంధించిన మంత్రా లకు బీజాక్షరాలు 'రామ' అనేవి అని త్యాగబ్రహ్మ 'శివమంత్రమునకు 'మ' బీజము, కేశవమంత్రమునకు 'రా' బీజము' అని కీర్తించి ఉన్నాడు. అందువల్ల శైవ, వైష్ణవభేదం లేకుండా అందరికీ గ్రాహ్య మైనది రామనామం!

ఇది బ్రహ్మ పదార్థాన్ని తెలుపుతున్న దనీ, చిదానంద స్వరూపమైనదనీ ఈ శ్లోకం తెలియజేస్తున్నది—

'రమంతే యోగినోఽనంతే
నిత్యానందే చిదాత్మని,
ఇతి రామపదేనాసౌ
పరంబ్రహ్మాభి ధీయతే.'

యోగపరాయణులైన మహాము నులు అవధి అనేది లేనిదీ, శాశ్వతమైనదీ, చిత్ స్వరూపమయినదీ అయిన బ్రహ్మానందాన్ని పొందడానికి కారణమైనది పరబ్రహ్మాత్మక మైన యీ రామనామమే! ('రము క్రీడాయాం' అనే ధాతువును అనుసరించి) యోగులు దీనియందు మహానందాన్ని పొందుతూ ఉంటారు— అని దీని భావం!'

అందువల్లనే శివుని వంటివాడు కూడా కాశీలో మృతిచెందేవారి చెవుల్లో ఈ రామ మంత్రాన్ని ఉపదేశించడం జరుగుతున్నది.

ఎంతటి పాపాత్ములయినా, జీవిత కాలంలో రామనామాన్ని ఉచ్చరించక పోయినా, మరణించే సమయంలో ఆ నామాన్నివిని ముక్తిని పొందుతున్నాడు.

అవి ముక్తక్షేత్రమైన వారణాసికి ప్రాశస్త్యమూ, పవిత్రతా కలగడానికి— అక్కడ మరణించిన వారందరూ ముక్తిని పొందడానికి ముఖ్యకారణమైన యీ తారక మంత్రమే కారణమై ఉండాలి.

దౌర్జన్యంతో దారులుకాచి, దోపిడులు చేసి, హత్యలు చెయ్యడానికి వెనుదీయని వాల్మీకి మహర్షి కావడానికి కారణం ఈ తారకమంత్రమే కదా!



ప్రకాశరావు

'మీరు రామారావుగారు కదూ ?'

వాష్ బేసిన్‌వద్ద చేతులు కడుక్కుంటున్న రామారావు ఉలిక్కిపడ్డట్టు తలెత్తి చూశాడు. సన్నగా, పొడుగ్గా, నవ్వుతూ నిలబడి వున్నాడు ఆ అడిగిన వ్యక్తి. బాగా చలాకీ అయిన మనిషి అని మొహం చూడగానే చెప్పేయవచ్చు. నల్లని పాంటులో గీతల చొక్కా టక్ చేసి నిటారుగా నిలబడి వున్నాడు. అతన్ని ఎప్పుడూ చూసినట్టు జ్ఞాపకం రాలేదు రామారావుకు. అతని చొరవకంటే ఎక్కువ రామారావును ఆశ్చర్య పరిచింది అతని భాషా, ధైర్యమూ.

'మీరు.....మీరు..... అవును నేనే...' అన్నాడు తడబడుతూ ఆలోచనల్లోంచి తేరుకుని.

రామారావు ఆ కాలేజీలో అసిస్టెంటు ప్రొఫెసర్‌గా చేరి అది రెండో రోజు. ఒంటరిగా వచ్చిన కారణాన్న హాస్టల్లోనే తింటున్నాడు. ఈ రాష్ట్రంలో తనొక్కడే తెలుగువాడై పోయాడే అని ఒక రకమైన దిగులుతో వున్నాడు, వచ్చిన మొదటి రోజు నుండీ. ఇలా ఒక అపరిచితుడు హఠాత్తుగా వూడిపడి సూటిగా పలకరించడంతో ఎక్కడలేని ఆనందం పొందాడు ఆశ్చర్యంతో బాటు.

'నన్ను రవి అంటారండి; మీరు మాథమాటిక్స్ డిపార్ట్‌మెంటులో జాయిన్ అయ్యారనుకుంటా.'

చేతులు తుడుచుకుంటూ బయటకు వచ్చారిద్దరూ. ఎవరెవరో రవిని చూసి చిరునవ్వు నవ్వుతున్నారు పలకరింపుగా; రవి కూడా అందరితోనూ పరిచయం వున్నట్టు తలూపుతున్నాడు. 'ఎంత బాగా నవ్వుతాడో ఇతను' అనుకున్నాడు రామారావు రవిని చూస్తూ. తీవిగా నడుస్తున్న రవి అంటే ఎక్కడలేని స్నేహభావం కలిగింది రామారావుకు. ఇంతవరకు ఇద్దరికీ ఎక్కువ మాటలు లేవు; అయినా ఏదో చిరకాల పరిచితుడుగా, ఎంతో పాత స్నేహితుడుగా భావన కలిగింది రామారావుకు. హడావుడిగా మెస్సులోకి, బయటకు నడుస్తున్నారు విద్యార్థులంతా.

'మీరు నన్నెలా గుర్తుపట్టారూ ?' ఉండబట్టలేక అడిగాడు రామారావు.

అతని భావాలు చదివినట్టుగా జవాబిచ్చాడు రవి.

'క్షమించాలి. మీతో నాకు పరిచయం లేదు. కాని మీరు ఇక్కడికి వస్తున్నట్టు ముందుగానే తెలిసింది; మీ విద్యార్థి రంగరాజు చెప్పాడు. అతను ఎమ్. ఈ. ఇంటర్వ్యూకు వచ్చాడిక్కడికి. ఇక్కడ సెలక్టు కాలేదు లెండి; అతను ప్రస్తుతం ఢిల్లీలో వున్నాడు. మీ విషయం అతనే చెప్పాడు. మిమ్మలను చూడగానే పోల్చుకున్నాను, తెలుగువారని. రంగరాజు చెప్పింది ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చి ధైర్యంగా తెలుగులోనే అడిగాను ... నేను సివిల్ ఇంజనీరింగు డిపార్ట్‌మెంటులో లెక్చరరుగా పని చేస్తున్నాను' చిన్నగా నవ్వాడు రవి తలతిప్పి రామారావు వైపు

'ఇతని అసాధ్యం కూలా!' విస్తుపోయాడు. 'పాతికేళ్ళకూడా నిండినట్టు లేదే ఇతనికి' అనుకున్నాడు, ముఫ్ఫైల్లో అడుగుపెట్టిన రామారావు. ఎంత ధీమా ఇతనికి, ఎంత చొరవ! బాగా కలుపుగోరు మనిషని అతని ప్రవర్తనా, ఆతన్ని అందరూ పలకరించే తీరూ చెప్తున్నాయి. అతని నడకలో ఆత్మ విశ్వాసం, హుందాతనం వుట్టిపడుతున్నాయి.

రామారావు బిక్కుబిక్కుమంటూ తిరిగాడు మొదటి రెండురోజులూ. ఇక్కడికి రావడం తన తెలివి తక్కువతనం, కక్కుర్తీ అనుకున్నాడు. ఛ! ఛ! ఇలా పొట్టచేతొ్త పట్టుకుని దేశం పైనబడటమేమిటీ, శుభంగా ఉన్నవూళ్ళో వుద్యోగం వదులుకుని అని బాధపడ్డాడు. భాషకూడా తెలియని వూళ్ళో దేవిరించడ మేమిటి అని కించపడ్డాడు. ఇంతదూరం వచ్చి మళ్లీ వెనక్కి వెళ్లిపోతే ఎంత చిన్నతనం, తనను తాను అసహ్యించుకున్నాడు. అక్కడే హాయిగా ఉన్న వూళ్ళో ఉండక ఇక్కడేదో మూలుగుతుందని రావడం ఎందుకూ అని తిట్టుకున్నాడు

రామారావు ఆంధ్రదేశంలో ఒకానొక కాలేజీలో మాథమాటిక్స్ లెక్చరరుగా ఎనిమిదేళ్ళ నుండీ పనిచేస్తున్నాడు. ఎదుగూ, బొదుగూ లేని జీవితం. అసిస్టెంటు ప్రొఫెసరు ఆ కాలేజీలో కావడం అసంభవం అని రూఢిగా తెలిసిన మరుక్షణం నుండీ బయటేనా ఆ వుద్యోగం దొరుకుతుందేమోనని గట్టి ప్రయత్నాలు మొదలుపెట్టాడు. అదృష్టం బావుండి అనుకోకుండా జయపూరు ఇంజనీరింగు కాలేజీలో దొరికింది.

'ఏదోలే దొరికినప్పుడు చూద్దాం' అని అనుకున్న రామారావు, అసిస్టెంటు ప్రొఫెసరు వుద్యోగం రాజస్థాన్‌లో రావడంతో సందిగ్ధావస్థలో పడ్డాడు. తన బి ఏ. లోని యూనివర్సిటీ రాంకూ, పి. హెచ్. డి., పబ్లిష్‌చేసిన పేపర్లూ తనకా వుద్యోగం సంపాదించి పెట్టాయి—ఇంటినుండి వేయి మైళ్ల దూరంలో. కాని ఈ అర్హతలు తన కాలేజీలో గుడ్డి గవ్వకు చెల్లలేదు. అదే వుద్యోగానికి. అసలు ఆంధ్రలో వున్నన్ని రాజకీయాలు - మరెక్కడేనా వున్నాయా అనిపిస్తూంది. కులతత్వాలూ, బంధుత్వాలూ, పలుకుబడీ పని చేసేంత గట్టిగా ఇంకేవీ పనిచేయవు, మనరాష్ట్రంలో. ఉన్నత పదవిలో బ్రాహ్మణుడున్నప్పుడు బ్రాహ్మణులను నింపేస్తే, రెడ్డిగారు పదవీ స్వీకారం చేసిన మరుక్షణం నుండీ రెడ్లతో కళ కళలాడిపోతూంది. శాస్త్రిగారికీ రెడ్డిగారికీ మధ్య అర్హతలున్న వ్యక్తులు నలిగిపోతారు. ఈ పరిస్థితుల్లో పని చేయడం ఎవరికీ శక్యం కాదు కాని మనవాళ్ళకు పనితో పనిలేదే! ఫలానా శర్మగారు చేయగలిగే పని ఫలానా రావుగారు కూడా చేయగలరు—వీరి ఉద్దేశ్యంలో! ఏం, ఎందుకు చేయలేడూ? చేయకపోయినా ఏం ఒరిగిపోతూంది? ఈ ఒక్కడూ సరిగ్గా పనిచేస్తే ఈ దేశం ఏమైనా బాగుపడుతుందా? — ఎప్పటికీ దీని గతి ఇంతే ఎలాగూ బాగుపడదు కనక మనమూ, మనవాళ్లైనా బాగుపడేలా చూడడం మన పవిత్ర కర్తవ్యం. దీనికోసం మనమంతా కంకణాలు కట్టుకుని కృషి చేస్తున్నాం. ఈ మనస్తత్వం భారతీయుల రక్తంలో జీర్ణించుకుపోయింది. దేశంకోసం పని చేయాలని కాదు, మనం పని చేయకుండా నెల నెలా జీతం డబ్బులు తినేస్తే దేశానికీ, దేశ ప్రగతికి వాటిల్లే నష్టం గురించి కానీ, సరైన వ్యక్తి సరైన స్థానంలో లేకుంటే మిగతావారిపైన దాని ప్రభావం గురించి కానీ, మన ప్రస్తుత నడవడీ, ప్రవర్తనా మన తరవాత తరం పైన దెబ్బతీస్తుందని కానీ మనం ఆలోచించం. ఎప్పుడూ మనకు కావలిసింది మన దగ్గరి బంధువు ఉన్నత స్థానంలో దూరి మన పనులు చేసిపెట్టడం, లేదా అడ్డ గాడిద అయిన సుపుత్రుడు రాకెట్‌లా పైపైకి ఎక్కిపోవడం. అంతా అర్హతలుండే పైకి వస్తున్నారా — ఛస్తున్నారా! ఏదో బండి నడుస్తూంది, మనం కూడా దాంతోబాటు పోతున్నాం; అంతే కాని దాన్ని నిరోధించడానికి మనం చేసే ప్రయత్నం శూన్యం. పైగా ప్రత్యక్షంగా దానికి దోహదం చేస్తున్నాం ఎవరైనా కష్టపడి, నిజాయితీగా పని చేసేవాడుంటే అందరికీ అడ్డంకులే అతన్ని మరోచోటికి మార్చడమో, లేక స్వస్తి చెప్పడమో, కనీసం అతడు పై స్థానంలోకిపోయి ఏకు మేకై కూర్చోకుండా వుండడానికి మిగతావాళ్ళంతా శాయశక్తులా కృషి చేస్తారు. ఈ రాజకీయాలూ, ఎత్తులూ కలుషిత వాతావరణం ఎవ్వరికీ మనశ్శాంతీ, ఏకాగ్రతా లేకుండా చేస్తాయి. దీంతో విధి నిర్వహణలో ఉత్సాహం తగ్గిపోతూంది. మొత్తానికి దెబ్బ తినేది దేశమూ, దేశ పురోభివృద్ధి.

ఇదంతా విని మామూలు విషయమైనట్టుగా నవ్వాడు రవి.

'చూడండి రామారావుగారూ, మన బలహీనతంతా ఇంటికి దగ్గర్లోనే వుద్యోగం చేయాలను కోవడమే. భారత దేశమంతా మనదే అయినప్పుడు, ఒకచోట మనం సరిగ్గా పనిచేయలేమనీ, అర్హతలు లేని వ్యక్తులు బంధుత్వాల మూలంగా పైకి పోతున్నారని తోచినప్పుడు మనం పనిచేయడానికి బోలెడన్ని అవకాశాలున్నాయి. మన దేశంనిండా, మనం ఇంటి దగ్గరే కూర్చోవాలి పట్టుబట్టకపోతే. అయినా ఎక్కడయితేనేం—పని చేయడానికి?'

మాట మార్చాడు రామారావు.

'ఇక్కడ తెలుగువాళ్లెవరూ లేరా — ఇంకా?'

'ఇక్కడ ఇద్దరున్నారు—పి. వి. రావుగారని మెకానికల్ ఇంజనీరింగులో అసిస్టెంటు ప్రొఫెసరూ, నారాయణగారని లెక్చరరూ — రేపు మీకు వీలుంటే రండి పరిచయం చేస్తాను.'

'మరే, వచ్చేవారం మా ఆవిడ వస్తుంది. ఎవరేనా గృహస్థులతో పరిచయం లేకపోతే పరిగెత్తుకు పోతుందేమో ఇంటికి అని భయం. నాలాగే ఆమెకూ హిందీరాదు.'

అర్థమైనట్టుగా నవ్వాడు బ్రహ్మచారి రవి.

* * *

'మా ఆవిడ — పార్వతి! అని పరిచయం చేశాడు రామారావు.

మర్యాద సూచకంగా నమస్కరించాడు రవి. ఢిల్లీ వెళ్ళడం మూలాన వారం రోజులుగా జయపూరులో లేడు రవి మూడు రోజులకిందే రామారావు తమ్ముడు ఆవిడను దిగబెట్టి ఆ రోజే తిరిగి వెళ్ళిపోయాడు; తీరిక లేదంటూ.

మామూలు ఎత్తు, పొడుగాటి జడ, నుదుట ఎర్రటి కుంకుమబొట్టు, గుండ్రటి మొహం, ఆకర్షణీయమైన కళ్ళు, ఉట్టి

కడే అమాయకతా—పార్వతిని చూడగానే ఆంధ్రుల ఆడపడుచని చెప్పేయవచ్చు. ఆంధ్రుల్లో కనిపించే స్నేహభావమూ, కొత్తవాళ్ళంటే కొద్దిగా బెంకూ ఆమెలో ప్రతిబింబిస్తాయి. మొదట్లో కొద్దిగా ముభావంగా వున్నా కొద్ది రోజుల్లోనే రవి ఆమెకు ఆత్మీయుడైపోయాడు. రవిలో ఆమెకు తనకు లేని అన్నయ్య కనిపించేవాడు. దాదాపు ప్రతి మరో రోజూ రవి వాళ్ళింటికి వెళ్తుండేవాడు.

ఒకరోజు రవితో అన్నాడు రామారావు. 'మా ఆవిడ వెళ్ళిపోదామంటుందోయ్ మా వూరికి—ఇక్కడ ఏం బాగోలేదనీ, బోరు కొడుతూందనీ అంటూంది.'

అదేమంత ఆశ్చర్యకరమైన విషయం కానట్టుగా నవ్వాడు రవి.

'నిజం! వూరికే దిగులుగా కూర్చుంటుందీ మధ్య. ఇంటినుండి ఉత్తరం వచ్చిన రోజు మరీ ఇదిగా వుంటుంది, రాకపోతే మళ్ళీ బెంగ. ఏం తోచడంలేదు—ఈవూళ్ళో భాష తెలీదు, స్నేహితుల్లేరు మాట్లాడుదామన్నా అంటూ ప్రాణం తీస్తుంది. 'ఉన్న వూరికి దూరంగా కక్కుర్తికి రావడం ఏందుకూ, వెళ్ళిపోదాం అని ఒకటే గోల.'

మామూలుగానే నవ్వాడు రవి, 'నా ఉద్దేశ్యంలో మీరూ అదే అనుకున్నట్టున్నారు.'

రామారావు ఏం మాట్లాడలేదు

'స్నేహితులు కావాలంటే బోలెడుమంది ఇక్కడేవా, మనం స్నేహంగా వుంటే. ఒకే చోట వుంటే ఎవరికేనా బోరు కొడుతూంది. ఉదయపూరు, ఆగ్రా, ఢిల్లీ, చండీఘర్, సిమ్లా, మసూరీ...చాలా ప్రదేశాలున్నాయే ఈ దగ్గరిలోనే ? మీకు భాష సమస్య గనక ఇక్కడి తెలుగువాళ్ళతో పరిచయం పెంచుకోండి—వాళ్ళు కూడా ఇలాగే బోరు ఫీలవుతూంటారు. పి. వి. రావుగారినీ, నారాయణగారినీ పరిచయం చేశాను గదా మీకు ?'

'అవునోయ్ పి. వి. గారింటికి రెండు మూడుసార్లు వెళ్ళాం. ఆయనా, ఆవిడా బాగా మాట్లాడుతారు కాని నారాయణగారిల్లు వీళ్ళింటినుండి కొద్ది దూరంలోనే వుందన్నారు. నాకు తెలీదు గనక పి. వి. రావుగారినే అడిగాను. అడిగినప్పుడెల్లా మొహం మాడ్చుకుని మాట మారుస్తారేం?' అనుమానం ధ్వనింపింపి రామారావు కంఠంలో.

'...వాళ్ళిద్దరికీ కొద్దిగా అభిప్రాయభేదాలు వచ్చాయి లెండి ఆ మధ్య—అందుకే కొద్దిగా ముభావంగా వుంటారు.'

'అంటే నీవు రాకముందు వీళ్ళిద్దరే కదా ఆంధ్రులిక్కడ—అయినా పోట్లాడుకున్నారా? ఒకే రాష్ట్రంలోంచి వచ్చి కూడా ఇక్కడ దెబ్బలాడుకోవడం ఏమిటి ?' ఆశ్చర్యంగా అడిగాడు రామారావు.

'ఏం, ఒకేరాష్ట్రం వారైతే స్నేహంగా వుండాలనీ, మిగతా రాష్ట్రాలవారితో దెబ్బలాడుకోవాలనీ ఎక్కడుంది ? మనుషులైన తరవాత అభిప్రాయభేదాలు రావడం సహజం. ఒకే ఇంట్లో పుట్టి పెరిగిన అన్నదమ్ములు దెబ్బలాడుకోగా లేంది ఇదేమంత విచిత్రంగా వుంది మీకు? మనమందరం భారతీయులమే అనే భావన వుంటే ఇక మనం సాధించలేనిదేముంది ?'

'నివెన్నైనా చెప్పవోయ్—అసలు ఆంధ్రులు తమలో తాము పోట్లాడుకునే ఇలా అఘోరిస్తున్నారు. అక్కడ రాష్ట్రంలో అలా ఏడిస్తే, ఇక్కడ ఇంత దూరంలో కూడా ఇదేమిటి ?'

రవి ఏం మాట్లాడలేదు.

రవి, రామారావు, పార్వతి కలిసి నారాయణ ఇంటికెళ్ళారు ఒక రోజు. అక్కడ పి. వి. రావును చూసి పూర్తిగా ఆశ్చర్యపోయాడు రామారావు. నారాయణా, పి. వి. రావూ కలిసి జోకులేసుకోవడం చూసి ఉండబట్టలేక అడిగాడు తిరిగి వస్తున్నప్పుడు.

'అభిప్రాయభేదాలు ఏ ఇద్దరికేనా వస్తాయి; అందుకని స్పర్ధలు పెంచుకుంటామా ? కొద్ది రోజుల్లో మామూలుగా అయిపోతారు మళ్ళీ.'

'అది కాదోయ్, ఒక్కసారిగా ఎలా కలిశారంటావు వీళ్ళు ?'—ఏదో తెలిసినట్టుగా మళ్ళీ అడిగాడు రామారావు, '...నీవు సంధి కుదిర్చావేమిటి ?'

రవి చిన్నగా నవ్వాడు జవాబివ్వకుండా.

'ఏం, ఒంట్లో బావుండలేదా ?' రవి అడిగాడు పార్వతిని.

'బాగానే వున్నానే' నీరసంగా వచ్చింది పార్వతి.

'ఒంట్లో బాగాలేదని కాదోయ్—ఇంటి మీద బెంగ.' కొద్దిగా కఠినంగా అన్నాడు రామారావు.

'...లేకపోతే ఏంటండీ—ఇల్లు వదిలి అందరికీ దూరంగా, ఎవరూ లేనట్టు ఎన్ని రోజులని ఇక్కడ వుండటం? అడవిలో వున్నట్టుంది నాకు. ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా వెళ్ళిపోవాలనుంది నాకు.' దాదాపు ఏడుపు గొంతుకతో అంది పార్వతి.

'ఈ లెక్కన చూస్తే నాకు ఛస్తే పెళ్ళవదు.' అల్లరిగా అన్నాడు రవి.

'ఏం ?' అంతా మరచిపోయినట్టు అడిగింది పార్వతి.

'ఇంతదూరం వచ్చి నాతో ఉండడానికి తెలిసి తెలిసి ఏ అమ్మాయి సిద్ధపడుతూందీ ? నాకు వద్దు వీడు— అనేస్తుంది చక్కగా ... అయినా ఇప్పుడు వెనక్కు ఎలా వెళ్తారు ? అక్కడా అసిస్టెంటు ప్రొఫెసరు ఉద్యోగం ఖాళీగా వున్నట్టు పేపర్లో వేశారా ?'

'లేదు, లేదు. అక్కడి లీవుతీసుకుని వచ్చానుగదా. మళ్ళీ లెక్చరరుగానే వెళ్ళాలి.'

'మీరక్కడ రిజైనుచేసి రాలేదూ !'

'లేదు ఎందుకేనా మంచిదని లీవులో వచ్చాను. ఇక్కడ సరిపడకపోతే వెళ్ళిపోవచ్చని.'

'అదీ సంగతి—అందుకే మీరు మొదటి నుండీ వెళ్ళిపోతాం, వెళ్ళిపోతాం అంటున్నారు. చక్కగా రిజైన్ చేసివస్తే ఇక్కడే సర్దుకు పోయేవారు.'

రామారావు సాలోచనగా వుండిపోయాడు.

పార్వతి అంది 'అసలు నేను. మొదటి నుండీ ఒప్పుకోలేదండీ. ఈయనే అక్కడ సరిపడకపోతే తిరిగి వద్దాం 'అని చెబితే ఏదో సరేనండీ అన్నాను... నాకేమో అన్నదమ్ము లెవరూ లేరు. చెల్లెళ్ళు బాగా చిన్నవాళ్ళు. మా అమ్మా నాన్నగార్లు ఒప్పుకోలేదు—అత్తా మామగారయితే సరేసరి.' వణికే కంఠంతో బెంగగా అంది మళ్ళీ, 'అక్కడెవరికేనా ఏదేనా అయితే మాకు కబురందేందుకే ఒక రోజు పడుతూంది మేం వూరు చేరడానికో మూడునాలుగు రోజులు,—ఎలా వుంటాం. చెప్పండి ఈ పరిస్థితుల్లో ఇక్కడ ?'

'ఎవరికేనా — ఏదేనా అవుతూందని ఎందుకనుకుంటారు?' రవి ఎదురుప్రశ్న

రసవర్గాలు - గుణాలు :

# నువ్వుల నూనె

అన్నంలో కలుపుకునేటందుకు సాధారణంగా మన ప్రాంతంలో నువ్వులనూనె వాడుతూంటారు.

నువ్వుల నూనె జఠరదీప్తిని, దేహపుష్టిని, బలాన్ని యిస్తుంది. దురద మొదలగు చర్మరోగాలను, క్రిమిరోగాన్ని, వాతాన్ని గొట్టును.

ఈ నూనెను అధికంగా వాడితే బాగా వేడిచేస్తుంది. పైత్యం చేస్తుంది దగ్గుట్టుకుంటుంది. కఫాన్ని, గుండె నొప్పిని శ్వాసను హెచ్చిస్తుంది. రక్తాన్ని క్షీణింపజేస్తుంది. శూలను పుట్టిస్తుంది. మేహ జ్వరాలను బలపరుస్తుంది. విరేచన బద్ధం చేస్తుంది. గర్భిణీ స్త్రీలు మరీ అమితంగా పుచ్చుకుంటే గర్భస్రావం కల్గవచ్చు!

నూనెను గాయంపైనగాని, సెగ్గడ్డల పైనగాని, పూసినట్లయిన వానిని మృదువు పరచి కొంతవరకు మాన్పును. వడ తగిలిన మనిషికి నూనెలో చనుబాలు పోసి రంగరించి చెవులలో పోసిన వడతీరుతుంది.

నూనె పిండివంటలు విదాహం చర్మరోగం, పైత్యం, వేడి, రక్తపైత్యం, వీనిని పుట్టిస్తాయి. సులభంగా జీర్ణం కావు. అధికంగా తింటే కళ్ళకు జబ్బులొస్తాయి.

నేత్రరోగాలు, జ్వరం, కుష్టు, శూల, భగందరము, పిచ్చి మతిభ్రమ గలవారు, రసమిశ్రితమైన ఔషధములు సేవిస్తున్నవారు నూనెను లోపలికి పుచ్చుకోకూడదు.

నూనెయొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు. 1. కలినీళ్ళు. 2. నీళ్ళుకలిపిన తేనె. 3. నారింజపండు. 4. పులిమజ్జిగ.

## సోపు

భోజనానంతరం కాస్త సోపు నోట్లో వేసుకొని నమిలే అలవాటు కొంతమందికుంటుంది. ఇది పెద్ద జీలకర్ర వలే ఉంటుంది. వేడిచేసి ఆర్పుతుంది.

పొట్టకు, గుండెకు, కళ్ళకు బలాన్ని యిస్తుంది. వాతాన్ని హరిస్తుంది. హృదయంలోని వికారాన్ని, నొప్పిని, ప్రక్కటెముకలలోని నొప్పిని, కడుపుబ్బును, అగ్నిమాంద్యాన్ని పోగొడుతుంది. ఊపిరి తిత్తుల్ని కిడ్నీస్‌ను, లివర్‌ను, శుభ్రపరుస్తుంది— శరీరంలోని చెడు పదార్థాల్ని తొలగించేందుకు తోడ్పడుతుంది. మల మూత్రబద్ధమును నిప్పుతుంది. బిడ్డల కడుపుబ్బును శమింపజేస్తుంది. బాలింతలగు స్త్రీలకు బాగా పాలు పడేటందుకు దోహదం చేస్తుంది.

హృద్రోగం, గుండె అదురుట, స్మారకం లేకపోవుట యిత్యాది బాధలున్నట్లయితే ఎద్దునాలుక చెట్టుయొక్క పువ్వులతో కషాయం పెట్టించి— ఆ కషాయంలో తగు మోతాదులో సోపు కలిపియిస్తే పై బాధలు తగ్గుతాయి. సోపు, సొంటి, నీళ్ళతోనూరి రసంతీసి, కొంచెం తేనె, పటిక పంచదార వేసి, తగు మోతాదులో పుచ్చుకుంటే గుండె నొప్పి తగ్గుతుంది.

దగ్గుకు, ఉబ్బసమునకు, యిచ్చే ఔషధములకు సోపు అనుపానంగా యిస్తే— ఆయా ఔషధముల యొక్క గుణం త్వరగా శరీర మంతటా వ్యాపిస్తుంది.

సోపును తేనెతో కలుపుకొని తింటే సామాన్యమైన జ్వరం తగ్గుతుంది.

ఒక డ్రాము ఎత్తు సోపు చూర్ణంలో అంతే ఎత్తుగల పంచదార కలుపుకొని వేసవి కాలంలో ఉదయంపూట పుచ్చుకుంటే ఆ సంవత్సరంలో సామాన్య పరిస్థితులలో ఏ వ్యాధి సోకదు.

సొంటి, సోపును వేరువేరుగా నేయిలో వేయించి— శుభ్రమయిన గుడ్డతో తుడిచి— వేరువేరుగా చూర్ణించి— సమ భాగాలుగా కలిపి — చిటికెడు చూర్ణాన్ని నోటిలో వేసుకొని కొద్దిగా సీలు పుచ్చుకుంటే నీళ్ళ విరేచనాలు కడతాయి.

సోపును పసుపు నీళ్ళతో నూరి రసం తీసి త్రాగిన—తుమ్మెదకాటు బాధ తగ్గుతుంది.

సోపు ఆకురసాన్ని కళ్ళల్లో వేస్తే నేత్ర రోగాలు నయమవుతాయి.

సోపు చెట్టువేరును తేనెతో గంధం తీసి యిస్తే పెర్రికుక్క విషం విరుగుతుంది సోపు ఆరమునకు కూడా సోపుకు గల గుణాలే కలవు.

సోపును నీళ్ళతో నూరి తీసిన రసం యొక్క మోతాదు 1 మొదలు 4 తులముల ఎత్తువరకూ యివ్వనగును. సోపు ఆరకు మోతాదు రెండు మూడు చుక్కలు అవున్న నీళ్ళలోగాని — తమలపాకు మీదగాని, వేసి యివ్వనగును. రసం తయ్యారానికి 1/8 తులం మొదలు 1 తులం ఎత్తువరకూ సోపు వాడవచ్చును.

కాకతత్వంగలవారు సోపు అధికంగా తింటే నష్టం వాటిల్లుతుంది.

దీని యొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు: 1. మంచిగంధం. 2. శికంజబీను.

**సేకరణ : ఆకుండి నారాయణమూర్తి**

# ప్రవాసి

వేశాడు.

'కిడెంపి మేలెంచమన్నారు గదా !' రామారావు అన్నాడు.

'మీరు కీడుమాత్రం ఎంచుతున్నారు. మేలు సంగతి ఆలోచిస్తున్నట్టు లేదే? ఇక్కడినుండి ఇల్లు చాలాదూరం అనుకోండి, కాని దానివల్ల ఏలాభాలూ లేవంటారా? ఇక్కడి ప్రదేశాలూ అవీ చూడడం మళ్ళీ మళ్ళీ వీలుపడుతుందా మనకు? మనం ఎక్కడ వుంటే అదే మన ఇల్లు అనుకుంటే సరిపోలా? ఇంటికి దూరంగా వుండటంవల్ల కొత్త పరిచయాలేర్పడుతాయి, విశాల దృక్పథం, కొత్త విషయాలపట్ల ఆసక్తి ఏర్పడుతాయి—కాదంటారా? స్వార్థం అనుకున్నా... ఇక్కడి వుద్యోగం వదిలి మళ్ళీ అక్కడ లెక్చరరుగా జాయిన్ అయితే, క్షమించాలి, అసిస్టెంటు ప్రొఫెసర్ అవడానికే ఎన్నేళ్ళు పడుతుందో ఆలోచించారా? ఆ తరవాత సంగతి దేముడెరుగు. ఇక్కడే ఓ ఐదారేళ్ళు అసిస్టెంటు ప్రొఫెసరుగా పనిచేస్తే ప్రొఫెసరుగా వెళ్ళవచ్చునేమో మీ వూరికి. తొందరపాటులో ఇలా వచ్చిన అవకాశం వదులుకుని వెళ్ళిపోవడం ఏమంత మంచి విషయంకాదని నా ఉద్దేశ్యం.'

రామారావూ, పార్వతీ వింటూ ఉండిపోయారు.

'ఇక మమతలూ, అనుబంధాలూ అంటారా—మా తమ్ముడు రఘు ఢిల్లీలో పనిచేస్తున్నాడు, చెల్లాయికి పెళ్ళై వెళ్ళిపోయింది; ఇక పెద్ద ఇంట్లో బిక్కుబిక్కుమంటూ మా అమ్మా నాన్నా మాత్రం వుంటారు. మనం చాలా విషయాల్లో ఎంతో బలహీనులం. మనకు తెలికుండానే మనం ఆత్మవంచన చేసుకుంటాం. మన దేశంలోనే పరదేశీయులమై పోతే విదేశాలకు వెళ్ళినవారి సంగతి? మా బాబాయి అమెరికాలో వున్నప్పుడు రాసేవాడు—నాకు హైదరాబాదులో మన వాళ్ళ మధ్యన వుండడానికి వీలయ్యే పక్షంలోనే తిరిగి వస్తాను, అందరికీ దూరంగా వున్నప్పుడు నాకు మద్రాసైనా, ఢిల్లీ అయినా, అమెరికా అయినా ఒకటే అని,

దీనికేమంటారు? విదేశాల్లో అయితే వేలాది మైళ్ళదూరంలో వుండటానికి మనం సిద్ధమే, కాని మన దేశంలోనే మరో ప్రాంతంలో వుండటానికి ఎందుకు జంకుతాం? మీరుకూడా విదేశాల్లో స్కాలర్‌షిప్పు వస్తే ఇప్పుడాలోచించే విషయాలన్నీ ఆలోచిస్తారా! ఈ మనస్తత్వం మంచిది కాదంటాను నేను. పెద్దవారైనా మన స్నేహం మూలంగా చెబుతున్నాను నేను.'

'నీవు చెప్పేది నిజమేనోయ్! కాని ఈవిడ వూరికే పోరుపెడుతుంటే ఎలా భరించడం? ఇక్కడేం తోచడంలేదు అని గోలపెడుతూంటే ఏం చేయగలన్నేను?'

'మీరు పూర్తిగా ఆవిడపైకి తోయడం భావ్యంకాదు. మీకుమాత్రం తీవ్రంగా అనిపించడం లేదూ వెళ్ళిపోవాలని? మీరే ఇక్కడ సరిపెట్టుకోలేనప్పుడు ఆవిడ ఎలా వుంటారు? ఒకవేళ మీకు ఇక్కడే వుండాలని వుంటే ఆవిడను ఒప్పించగలగడం ఏమిటి—మొదట్లోనే రిజైన్‌చేసి వచ్చేవారు.'

పార్వతి ఆతృతగా రామారావు వేపు దృష్టి మరల్చింది.

పేలవంగా నవ్వాడు రామారావు. 'అవునోయ్—నాకు చిన్నప్పటినుండీ తిరగడం, ఇంటికిదూరంగా వుండటం అలవాటులేదు. బలహీనతే అను— మరేదేనా అను. పార్వతి కూడా బెంగగావుంటే పూర్తిగా భరించలేక పోతున్నాను. ఇక్కడికి వచ్చి నాలుగు నెల్లపైనే అయినా సరిపెట్టుకోలేక పోతున్నాను నేను. ఈ డిసెంబర్లో వెళ్ళిపోదామనుకుంటున్నాం.'

పార్వతి మొహంలో కొత్త కాంతి, గెలుపొందినట్టుగా ఉత్సాహమూ కనిపించాయి.

'మీరు ఇక్కడే వుండిపోతారా?' పార్వతి అడిగింది.

'చెప్పలేను. నాకు ఎక్కడేనా ఒక్కటే—నేను సరిగ్గా పనిచేయగలిగినంత కాలం ఇక్కడే వుండిపోతానని గట్టిగా చెప్పలేను. అవకాశం వుంటే మరోచోటికి తప్పకుండా వెళ్తాను. మా వూరికి దగ్గర్లోనే వుండాలని నేననుకోవడం లేదు' నిశ్చలంగా అన్నాడు రవి.

నవ్వుతూ అంది పార్వతి 'మరి మీకు పెళ్ళి కాదుగా!'

నవ్వుతూనే జవాబిచ్చాడు రవి 'క్షమించాలి. పెళ్ళే జీవితానికి పరమార్థం అనుకోను. నాతోడుగా నడవగలిగే అమ్మాయి కనుపిస్తే తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను. ఆమె ఏ రాష్ట్రానికి చెందినదైనా నాకనవసరం. అలా ఎవరూ కనిపించకపోతే ఇలాగే జీవితయాత్రను సాగించగలను.' కాస్సేపాగి చిలిపిగా అన్నాడు రవి, 'ఆంధ్రుల అమ్మాయిలకెవ్వరికీ నేనక్కర్లేకపోతే రాజస్థాన్ కన్యనే చేసుకుంటాను.'

* * *

బరువుగా నిట్టూర్చి తలెత్తి చూశాడు అసిస్టెంటు ప్రొఫెసర్ రామారావు, అసోసియేట్ లెక్చరర్ ధర్మారావువేపు. కాన్పూర్‌లో లెక్చరరుగా అపాయింట్‌మెంటు వచ్చింది వెళ్ళాలా అని, వెళ్ళితే ఎలా వుంటుందక్కడ అని రామారావును సలహా అడగడానికి వచ్చాడతను. ఒక్కసారిగా రవి జ్ఞాపకం వచ్చాడు రామారావుకు. నెరసిన జుత్తులోకి వేళ్ళు పోనిస్తూ అన్నాడు.

'తప్పకుండా వెళ్ళండి, మీరు ముందుకు పోవడానికి మంచి అవకాశాలున్నాయి అక్కడ. వచ్చిన అవకాశం వదులుకోవడం మంచిది కాదు. కాన్పూర్‌లో డాక్టర్ రవి ప్రొఫెసర్‌గా వున్నాడు; నాకు బాగా తెలుసతను చాలా మంచివాడు. మీకు ఉత్తరం రాసిస్తాను, కూడా తీసుకెళ్ళండి.'

నమస్కరించి వెళ్ళిపోతున్న ధర్మారావును వెనక్కి పిలిచాడు రామారావు.

'లీవు తీసుకోకండి— రిజైన్‌చేసి వెళ్ళిపొండి' కంగారుగా అన్నాడు. ●

# సంస్కృత విశ్వవిద్యాలయాన్ని ఎక్కడ నెలకొల్పాలి ?

భారతదేశంలో ప్రధానంగా ఉన్న పధ్నాలుగు భాషలకూ—ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంస్కృతభాషతో సంబంధం ఉన్నది. తమిళనాడులోని కొందరు మాత్రం తమిళానికి సంస్కృతంతో ఎట్టి సంబంధమూ లేదని అంటూ ఉన్నా, పరిశోధకులలో అధికసంఖ్యాకులు వారితో ఏకీభవించరు. సంబంధం సంగతి ఎలాఉన్నా, దేశాభ్యున్నతికీ, ఆలోచనాశక్తికీ, నాగరికతకూ గీర్వాణభాషయొక్క ఆవశ్యకత ఎంతైనా ఉన్నది.

విదేశీయపరిపాలకులకాలంలో సంస్కృతభాష, ఇతరదేశభాషలతోపాటు అణగత్రొక్కబడినా—స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశభాషలతోపాటు సంస్కృతమున్నూ క్రమక్రమాభివృద్ధిని పొందుతున్నది. కేంద్రప్రభుత్వం సంస్కృతప్రాధాన్యాన్నిగుర్తించి దాని అభివృద్ధికి అన్నివిధాలా సహకరిస్తున్నది.

తెలుగుభాషకు సంస్కృతం అవసరం ఎంతో ఉన్నది. మన పురాణాలూ, కావ్యాలే కాకుండా శాస్త్రగ్రంథాలుకూడా సంస్కృతానువాదాలే అన్న సంగతిని ఎవ్వరూ కాదనలేరు. తమిళనాడులోని పాఠశాలల్లో సంస్కృతభాషాబోధన తొలగించబడినా, ఆంధ్రప్రదేశంలోమాత్రం అలా జరగలేదు. సంస్కృతభాషకు పాఠశాలల్లో తగినస్థానం ఇవ్వబడి ఉన్నది. ఈ విషయాలను గమనించే కేంద్ర ప్రభుత్వంవారు దక్షిణప్రాంతంలో స్థాపించబూనుకున్న సంస్కృత విశ్వవిద్యాలయానికి ఆంధ్రప్రదేశాన్నే ఎన్నుకోవడం జరిగివుంటుంది.

సంస్కృత విశ్వవిద్యాలయాన్ని ఏవూరిలో స్థాపించాలనే విషయంలో విభిన్నాభిప్రాయాలు వినవస్తున్నవి. కొందరు తిరుపతిలో నెలకొల్పడం సముచితమని, కొందరు విశాఖజిల్లాలోని విజయనగరంవద్ద స్థాపించడం సబబని తమ తమ అభిప్రాయాలను వెల్లడించినట్లు తెలుస్తున్నది.

ఇప్పుడు చాలాచోట్ల ప్రాచ్య కళాశాలలు స్థాపింపబడి ఉన్నవి. కాని ఏభయి ఏళ్ల క్రిందట తెలుగుదేశంలో ఉన్న సంస్కృత కాలేజీలు రెండంటే రెండే ప్రసిద్ధంగా ఉండినవి. మొదటిది విజయనగరంలో మహారాజావారి పోషణక్రింద ఉన్నది ఒకటీ, రెండవది తిరుపతిలో దేవస్థానం పరిపాలనలో ఉన్నదొకటిన్నీ. సమర్థులయిన మహావిద్వాంసులు ఈ రెండు కళాశాలల్లోనూ ఉండేవారు. అప్పట్లో తిరుపతిలో కేవలం శిరోమణి తరగతులే ఉండేవి. విజయనగరంలో శిరోమణితోపాటు విద్వాన్ పరీక్షకున్నూ బోధన జరిగేది. ఆ పరీక్షలో ప్యాసు కావాలంటే విజయనగరం వచ్చి తీరవలసినదే! ఈ విధంగా ప్రాచ్య విద్యలో తిరుపతికంటె విజయనగరానికే ప్రాముఖ్యం ఉండేది.

ఆంగ్ల కళాశాలల్లో జరిగే బోధన ప్రకారం పట్టపరీక్షకు నాలుగేళ్ల పాఠ్యప్రణాళిక సంస్కృతంలోనూ, తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, ఒరియా అనే దేశ భాషల్లోనూ 1914 వ సం. ప్రాంతాన నిర్ణయించబడింది అప్పట్లో దక్షిణాదిని మద్రాసు విశ్వవిద్యాలయం ఒక్కటే ఉండినది. దక్షిణ ఒరిస్సా మద్రాసు రాష్ట్రంతోనే చేరిఉండడంవల్ల ఒరియా విద్యార్థులున్నూ ఈ విశ్వవిద్యాలయ పరీక్షల్లోనే ఉత్తీర్ణులు అయేవారు. ఆ పరీక్షల నిర్వహణలో విజయనగరం ప్రముఖపాత్రను వహించేది.

ఈ విద్వచ్ఛిరోమణి పరీక్షలు లేక పూర్వం కూడా విజయనగర విద్యార్థులు ఒక ప్రణాళికను అనుసరించే సంస్కృత విద్యను అభ్యసించేవారు. వారు క్రమపద్ధతిలో అధ్యయనం చేసి, కాశీ విద్యాపీఠంలో పరీక్షలిచ్చి పట్టాలు పొందేవారు

విజయనగరం మొదట్నుంచీ విద్యానగరంగానే ఉండేది. అభినవభోజులైన ఆనందగజపతి మహారాజులుంగారు విద్వద్గోష్ఠులు నెలకొల్పి విద్వాంసులను సత్కరించేవారు. ఆ సంప్రదాయం ఇప్పటికీ ఉన్నది.

ఈనడుమ విజయనగర సంస్కృత కళాశాలా శత వార్షికోత్సవాలు జరిగినప్పుడు ఆంధ్రప్రదేశ్ గవర్నరు, విజయనగర ప్రభువు శ్రీ పి. వి. జి. గారు మున్నగు



వారు విజయనగరంలో విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలని సూచనలు చేశారు. శ్రీ రాజా వారు విజయనగర సమీపంలోని చింతలవల్లిలోని తమ భవనాన్ని, పరిసర ప్రాంతాలనూ సంస్కృత విశ్వవిద్యాలయానికి ఇచ్చేటట్లు వాగ్దానం చెయ్యడమేకాకుండా, ఆ విశ్వవిద్యాలయ పద్ధతుల పరిశీలనకు కాలేజీ ప్రిన్సిపలు శ్రీ శేషశాయిగారిని కాశీకి పంపినట్లు కూడా తెలియవచ్చింది. ఆ తర్వాత ఏమి జరిగినదీ వివరంగా తెలియదు కాని, శ్రీ పి. వి. జి. గారికి ఈ విషయంలో పట్టుదల ఉన్నట్లు తెలుస్తున్నది..

తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉండనే ఉన్నది. ఎన్నో అనుబంధ కళాశాలలున్నవి. జనసమ్మర్దం ఎక్కువగా ఉండే యాత్రాస్థలంకూడాను. గుంటూరు, విజయవాడలు పాశ్చాత్య విద్యకేకాకుండా ప్రాచ్యవిద్యకున్నూ కేంద్రాలు. అయినా, ఆ ప్రాంతంలో అరవింద విశ్వవిద్యాలయం నెలకొల్పబడే అవకాశం ఉన్నది. విశాఖ జిల్లాలో విజయనగర ప్రాంతం, దానిని ఆనుకొని ఉన్న శ్రీకాకుళంజిల్లా వెనుకబడిన ప్రాంతాలు. వాటిని అభివృద్ధికి తేవడం ప్రభుత్వ కర్తవ్యం. విజయనగరం శతాబ్దాల తరబడి ప్రాచ్యవిద్యలకు కేంద్రం. అక్కడి గ్రంథాలయాలలో ముద్రితాలు, అముద్రితాలు అయిన అమూల్య గ్రంథాలు ఎన్నో ఉన్నవి. ఇప్పటివారు ఎరుగని— పునర్ముద్రణ పొందని అమ్మువుస్తకాలు చాలా సంస్కృత కళాశాలా గ్రంథాలయంలోనూ, రాజభవనంలోని గ్రంథాలయంలోనూ ఉన్నవి. అక్కడ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పితే భవన నిర్మాణానికయ్యే వ్యయం తగ్గుతుంది. విద్యార్థులకూ, అధ్యాపకులకూ వసతులు నిర్మించడానికి విశాలమైన స్థలం లభ్యమవుతుంది. అక్కడి వాతావరణం ప్రశాంతమైనది.

అందువల్ల అన్ని విధాలా సంస్కృత విశ్వవిద్యాలయ స్థాపనకు విజయనగరం ఎంతో అనుకూలమైనదని అందరూ గ్రహించగలరు. ఈ విషయాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గమనించి అచ్చటనే ఈ సంస్థను నెలకొల్పగలరని ఆశిస్తున్నాను.

—ఆంగీరస ●




### జరిగిన కథ

కాంతారావు పెళ్ళయిన దగ్గర్నుంచీ హనీమూన్‌కి వెళ్ళాలనుకుంటున్నాడు. ఇద్దరు పిల్లలు కలిగినా అతని ఆశ తీరలేదు. అనుకోకుండా వచ్చిన డబ్బుతో పిల్లలతోసహా ప్రేమయాత్రకి బయల్దేరి తీరాలి అనుకున్నాడు. అతని కోరిక కళ్యాణిని మొదట్లో ఆశ్చర్యపరిచినా — ఆ ప్రయాణం ఆమెకీ ఆనందమే. బయల్దేరదామంటే బయల్దేరదామనుకున్నారు. వారి మొదటి మజిలీ తిరుపతి. దైవదర్శనం అయ్యాక కాళహస్తి వెళ్ళారు. ఆ తర్వాతి ప్రయాణం కంచికి. మొత్తం మీద, కంచి చేరుకునే వరకు వారి యాత్ర ఆనంద భరితంగానే వుంది, కంచిలోవున్న దేవాలయాల నన్నింటినీ సందర్శించారు. బెంగుళూరు పరిసరాల్లో సరికొత్త వాతావరణంలో కళ్యాణీ కాంతారావు మధురానుభూతుల్ని చవి చూశారు. అప్పుడప్పుడు వచ్చే ప్రణయకలహాలు వారిని మరింత దగ్గరకు చేర్చుతున్నాయి. వారి యాత్రలో చివరి ప్రదేశం ఊటీ. ఊటీ ప్రకృతి సౌందర్యం వారిని ముగ్ధుల్ని చేసింది.

## 14

బస్సు ఎన్నో మెలికలు తిరిగి మెల్లగా ప్రయాణం చేస్తోంది కొండమీద. ప్రకృతిలోని అందమంతా అక్కడ కుప్పగా పోసినట్లుంది. కొండలమీద ప్రతి అంగుళం పచ్చని చెట్లతో నిండిపోయి ఉంది.

చివరకు బస్సు 'ఊటీ' చేరుకున్న తరువాత 'ఉడ్‌లాండ్స్' హోటలులో రూము తీసుకున్నాడు కాంతారావు.

తమ ప్రొఫెసరుతో కాంతారావు మాట్లాడటం చూసిన కుర్రవాళ్ళు అతను దిగుతుంటే 'సాయంత్రం 'లేక్' దగ్గరకు రండి సార్! సర్దాగా 'బోటింగ్ చేద్దాం!' అన్నారు కొందరు.

కాంతారావు నవ్వుతూ 'అలాగే!' నంటూ చెయ్యి ఊపేడు.

హోటలులో భోజనంచేసి, కాసేపు విశ్రాంతి తీసుకుని సాయంత్రం అయేసరికి 'లేక్' దగ్గరకు వెళ్ళేరు. లేక్ దగ్గర దృశ్యాలన్నిటినీ వివిధకోణాల్లోను తీయటానికి కెమెరాలో ఒక పూర్తి ఫిలిం అయిపోయింది. కళ్యాణినీ, కాంతారావును బోటులో కూర్చోమని ఒక స్టూడెంటు వాళ్ళిద్దరినీ కలిపి ఒక ఫోటో, పిల్లలతో కలిపి ఒక ఫోటో తీసేడు. తరువాత స్టూడెంట్సంతా తలో బోటు జట్లుగా ఎక్కేరు. కొందరు సెల్ఫ్ డ్రైవింగు చేసుకుంటూపోతుంటే మరికొందరు చేతకాని వారు ఊరికే కూర్చుని బిగ్గరగా పాటలు పాడుతూ, చేతులతో నీళ్లను ఒకరి మీద ఒకరు చిమ్ముకుంటూ కాలక్షేపం చేసేరు. ఒకడు విజిల్‌వేస్తుంటే మరొకడు గుర్రంలా సకిలించేడు. ఒకడు బిగ్గరగా పాడుతుంటే మరొకడు నోటితోనే మద్దెల చప్పుడుమ చేయసాగేడు. ఈ కోలాహలంమధ్య అప్పుడప్పుడు 'శాండల్ ఉడ్ సోప్' అనీ 'కాస్టాయిల్ ఫేస్' అనీ కూడా ఎవరో గుర్తు తెలియని కంఠాలు అరుస్తుంటే ప్రొఫెసర్ ముఖం కోపంతో నిస్సహాయతతో కందగడ్డలా అవటం గమనించిన కాంతారావు, ప్రొఫెసర్ ముఖం అచ్చు శాండల్ ఉడ్ సోప్ రంగులో, అదే ఆకారంలో ఉందనీ, ఆయన ఒంటరిగా కూర్చున్నపుడు అతని ముఖంలోని ఎక్స్‌ప్రెషన్ అచ్చు ఆముదం తాగిన ముఖంలాగే ఉంటుందనీ గ్రహించేడు. ఏంతైనా అతనుకూడా ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నవాడే కనుక వెంటనే ఆ రెండూ ప్రొఫెసర్‌గారి నిక్‌నేమ్సు అని గ్రహించి నవ్వుకున్నాడు కాంతారావు.

పిల్లలకు మాత్రం ఆ బోటు షికారు మహా హుషారుగా ఉంది. తమకంటె పెద్ద వయసులో ఉండి తమకన్నా ఎక్కువగా అల్లరి చేస్తున్న ఆ విద్యార్థులను 'ఎడ్మిరేషన్'తో చూస్తూ కూర్చున్నారు. అమ్మా నాన్నల వెంట కలసి చేసిన యీ యాత్రలో యీ సమయంలో పొందినంత ఆనందాన్ని వాళ్లు ఎప్పుడూ పొందలేదు. అందువల్ల వాళ్ళు కూడా ఉత్సాహంతో కేకలేస్తుంటే విద్యార్థులు వాళ్ళను తీసుకుని ఒక బోటులో నుండి మరొక బోటులోకి విసిరేస్తూ యింకా పిల్లలను నవ్వించేరు.

కాంతారావు, కళ్యాణి ఒక బోటులో కూర్చున్నారు. పిల్లలు తల్లిదండ్రులను వదిలి విద్యార్థులలోనే ఒకరినుండి మరొకరి దగ్గరకు మారుతున్నారు. 'ప్రొఫెసర్‌గారు కూర్చున్న బోటులో మరొక స్టూడెంటు కూర్చుని బోటును నడుపుతున్నాడు. ప్రొఫెసరు బోటు కాంతారావు బోటు పక్క పక్కనే ఉండటంవల్ల వాళ్ళిద్దరూ అవీ యివీ మాట్లాడుకోసాగేరు.

ఇంతలో హఠాత్తుగా ప్రొఫెసర్ కూర్చున్న బోటు తల్లక్రిందులయింది. 'అరే బాప్‌రే బాప్! మరగయా!' అంటూ ప్రొఫెసర్ నీళ్ళలో మునుగుతూ, తేలుతూ అరుస్తున్నాడు. ఆ ప్రొఫెసర్‌కి యీత రాదని తెలిసింది కాంతారావుకి. వెంటనే నీళ్ళలోకి ఉరికి ఆయనను పట్టుకుని తమ

బోట్లో పడుకోపెట్టేరు. అప్పటికే ఆయన నీళ్ళు మింగటం, భయంతో స్పృహతప్పి పడిపోవటం కూడా జరిగిపోయింది. ఐతే కాంతారావుకి ఆశ్చర్యాన్ని కలిగించిన విషయమేమంటే విద్యార్థులెవరూ ఆ సంఘటనకు భయపడలేదు కదా, పొట్ట చెక్కలయ్యేలా విరగబడి నవ్వసాగేరు. ఆ నవ్వుతున్నవాళ్ళల్లో ప్రొఫెసర్ బోటును నడిపిన కుర్రవాడు కూడా ఒకడు. అప్పుడర్థమయింది కాంతారావుకి. ప్రొఫెసర్‌కి యీత రాదని తెలిసే, ముందుగా ప్లాను వేసుకుని విద్యార్థులందరూ కలిసి కట్టుగా ఆ పని చేసేరని. అది చూడగానే కాంతారావుకి కొంచెం కోపం కూడా వచ్చింది.

'ఇదిగో అబ్బాయిలూ! ఇటు చూడండి ఒకసారి. నేనూ నిన్న మొన్నటిదాకా మీలాగే విద్యార్థినే! మీలాగానే నేను కూడా ప్రొఫెసర్లను ఏడిపించినవాడినే! కాని హాస్యం యింత క్రూరంగా ఉండటం చాలా భరించరాని విషయం. నేనుండబట్టి సరిపోయింది. ఆయనోపక్క లబోదిబోమని అరుస్తుంటే వినకుండా అలాగే నవ్వుకుంటూ చూస్తుంటే ఆలోపల ఆయన ప్రాణాలు పోతే యేమయ్యేది ? ఈ వయసులో కొంత కొంటెతనం అల్లరితనం ఉండటం మంచిదే కాని అది మితిమీరితే దారుణమైన ఫలితాలకు దారి తీయగలదు.' అంటూ సన్నగా చివాట్లు పెట్టేడు.

ప్రొఫెసర్‌ని దగ్గర్లోనే ఉన్న హోటలుకి తీసుకువెళ్ళి ప్రథమ చికిత్స చేయించాక ఆయనకు స్పృహ వచ్చింది.

ఆయన కళ్ళు తెరవగానే ఎదురుగా వీరువు తెచ్చిపెట్టుకున్న వినయవిధేయతలతో చేతులు కట్టుకుని నిల్చున్న శిష్యరత్నాలను చూస్తూనే సిగ్గుతో చితికిపోయి, వెంటనే కళ్ళు మూసుకున్నాడు. కాంతారావు వాళ్ళందరినీ బయటకు వెళ్ళమని సంజ్ఞ చేసేసరికి ఒక్కరొక్కరే మెల్లగా బయటకు పోయేరు. వెంటనే పెద్ద పెట్టున నవ్వులు వినిపించేసరికి ఆ శబ్దాలు వచ్చి ప్రొఫెసర్‌గారి గుండెకు సమ్మెట పోటులా తగిలినయ్. అవమానంతో, సిగ్గుతో ఆయన హృదయం దహించుకుపోతుంటే పైకి మాత్రం చిరునవ్వు నవ్వుతూ 'థాంక్యూ వెరీమచ్ జెంటిల్‌మన్! యు హేవ్ సేవ్డ్ మీ—యు హేవ్ సేవ్డ్ మై ఫామిలీ!'



అన్నాడు.

కాంతారావు హృదయం ఆర్ద్రమయింది. 'నెవర్‌మైండ్ ! నెవర్‌మైండ్ ! మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి.' అని లేచి బయటకు వచ్చేసేడు.

ఐతే అప్పటికీ, ఆ తరువాత కాని ఆ ప్రొఫెసర్‌కి తను నీళ్ళలో పడింది ప్రమాదవశాత్తూ అనే తప్పు విద్యార్థులే కావాలని తననలా 'ఫూల్'ని చేసేరని తెలియదు.

'పాపం! బ్రతకలేని బడిపంతులు!' అనుకున్నాడు కాంతారావు బయటకు వస్తూ.

'బడిపంతులు ఉద్యోగం చెయ్యాలంటే పట్టి బుర్ర ఉన్నంతమాత్రాన చాలదు. గుండెధైర్యం కూడా బాగా ఉండాలి. లేకపోతే కష్టం!' అనుకున్నాడు కాంతారావు.

ఆ రాత్రి హోటలుకు వెళ్ళేక నీళ్ళలో తడవటంవల్ల కాంతారావుకి కొంచెం జలుబు చేసింది. తల దిమ్ముగా ఉంటే కణతలకు అమృతాంజనం, గొంతు దగ్గరా, ఛాతీ దగ్గర 'విక్సు' రాసుకుని, పిల్లలతోపాటు తాను కూడా పడుకుని వెంటనే నిద్రపోయేడు.

కళ్యాణికయితే నిద్ర పట్టలేదు. ఎంత అలసిపోయినా అలవాటు ప్రకారం రాత్రి పది గంటలవుతే గాని ఆమెకు నిద్రపట్టదు. పోనీ యేమైనా పుస్తకం చదువుకుందామా అంటే లైట్ వేసినట్లయితే భర్తకి, పిల్లలకు నిద్రాభంగమవుతుందన్న భయంతో ఆ ఉద్దేశ్యాన్ని విరమించుకుంది.

కాలక్షేపం ఎలాగో తెలియక లేచి, తలుపులు తీసి బయటకు వచ్చింది. ఎత్తుగా ఉన్న ఆ హోటలు రూము ముందు నిలబడి చూస్తే ఎదురుగా వెన్నెల వెలుగులో మధురంగా వెలిగిపోతున్న ఆ ప్రకృతి సౌందర్యం ఆమెను పరవశింపజేసింది. వెంటనే శాలువ కప్పుకుని, తలుపులు దగ్గరగావేసి బయటకు వచ్చింది కళ్యాణి. హోటలు దాటి కొన్ని గజాలు దిగిరాగానే మైన్‌రోడ్డు. ఆ రోడ్డుకి ఆవలి వైపున విరగబూచిన ప్రకృతి సౌందర్యం. అనాలోచితంగానే ఆ సౌందర్యసీమ వైపుకు ఆమెను లాక్కుపోయినయ్ ఆమె కాళ్ళు.

ఎక్కడ చూసినా కుదురుగా కత్తిరించబడిన చెట్లు, రంగు రంగుల పూలు, పచ్చని గరిక, దూరంగా విచ్చలవిడిగా పెరిగిన పరుకు చెట్లు...అన్నిటికీ పైన నిండు

## పిల్లలతో ప్రేమయాత్ర

పున్నమి జాబిలి. ఆ ప్రదేశాన్ని చూస్తుంటే ప్రకృతి కాంత తన సౌందర్యానికి తానే మిడిసిపడుతూ విరగబడి నవ్వుతోందా అనిపిస్తోంది.

కళ్యాణి వెళ్ళి పచ్చగడ్డి మీద చతికిలబడింది. ఆమె కెదురుగా ఒక చిన్న జలాశయం. ఆ జలాశయానికి మధ్యగా బిందె చంకన పెట్టుకుని యౌవనాన్ని, శరీరపు హొయలను ఒలకబోస్తూ వయ్యారంగా నిలబడిన ఒక రాతి ప్రతిమ ఉంది. ఆ ప్రశాంత వాతావరణంలో ఒక అరగంటసేపు నిశ్శబ్దంగా అలాగే కూర్చుండిపోయింది కళ్యాణి. తనకి బుద్ధి తెలిసినప్పటినుండి యింత ఒంటరిగా, యిలా రాత్రిపూట ప్రశాంతమైన వాతావరణంలో ఎప్పుడూ కూర్చోలేదు. ఆధునిక జీవితంలో ప్రశాంతత లేదు. అందులో వేగం ఉంది. ఉద్రేకం ఉంది. అందునా వివాహమయిన తరువాత తన జీవితంలోని వేగం మరింత రెట్టింపయింది. రోజూ సూర్యుడుదయించగానే ఒకదానివెంట మరొక పని యాంత్రికంగా చేసుకుపోవటం, నిద్రపోవటం, మళ్ళీ తెల్లవారగానే మామూలు దినచర్యను ప్రారంభించటం. స్త్రీ కాని, పురుషుడు కాని, ఏ హోదాలో ఉన్నా, ఏ ప్రదేశంలో ఉన్నా, నాగరిక జీవనంలో ప్రతి ఒక్కరికీ ఏదో ఒకేరకమైన రొటీన్; వేగం ఉంటాయి.

ఎప్పుడైనా విశ్రాంతికోసం దూరప్రదేశాలకు వచ్చినా రైలు ప్రయాణాల్లో, హోటలు గదుల్లో ఉద్వేగభరితమైన అనుభవాలు మనిషిని మానసికంగా, శారీరకంగా మరింత అలసిపోయేటట్లు చేస్తాయే తప్ప, తాము కోరుకున్న విశ్రాంతిని మాత్రం యేమాత్రం యివ్వవు. ఇలా ప్రయాణాలు చేసేవాళ్ళ జీవితంలో 'మార్పు' అనేది లభిస్తుందేమో కాని 'విశ్రాంతి' అనేది లభించటం కల్ల. ఈ యాత్రలో తాను కనుక్కొన్న సత్యాలలో అదొకటి అందుకే అలా వంటరిగా చుట్టుప్రక్కల నరసంచారం లేని ఆ ప్రదేశంలో, పూలమొక్కల మధ్య, నక్షత్రాల వెలుగు క్రింద కూర్చునేసరికి ఆమె మనశ్శరీరాలు రెండూ విశ్రాంతిని పొంది, ఒక రకమైన తన్మయస్థితిలోకి తీసుకుపోయినయ్ కళ్యాణిని.

'కళ్యాణీ !' అన్న పిలుపు విని హఠాత్తుగా ఉలికిపడి చూసింది కళ్యాణి.

ఎదురుగా కాంతారావు నిలబడి ఉన్నాడు.

'ఇక్కడ కూర్చున్నావేమిటి ?' ఆశ్చర్యం, ఆతృత రెండూ మిళితమైన స్వరంతో అడిగేడు.

'ఏం లేదు. నిద్ర పట్టకపోతే యిలా వచ్చేను.' అన్నది కళ్యాణి.

అప్పుడు భర్త రాక ఆమెకు ఏమాత్రం ఆనందాన్ని కలిగించలేదు. పైగా తన తపస్సుకు భంగం కలిగినందుకు కొంచెం కోపం కూడా కలిగింది.

కాంతారావు ఆమె పక్కనే కూర్చున్నాడు.

కళ్యాణి ఎంతసేపటికీ అతనితో మాట్లాడక ఎటో చూస్తూ కూర్చునేసరికి అతనికి ఎందుకో భయం వేసింది.

'ఏమిటి కళ్యాణీ ! ఎందుకలా ఉన్నావు? నీ ఒంట్లో బాగాలేదా ?' అనడిగేడు ఆమె

### జ్ఞాపకం ఉంచుకోండి!

దుబారా కాకుండ అందరికి సరిపడా జాగ్రత్తగా వండుకోవాలి. ఒకవేళ ఎక్కువ మిగిలినా పారేయక వాడడం నేర్చుకోవాలి.

వంటలు ఎప్పుడూ ఒక్కలాగారావు. భయపడకూడదు. కొత్త వంటలు చేయడం మానకూడదు. అభ్యాసము కూసువిద్య అన్నారుకదా. చేయగా చేయగా అవే వస్తాయి.

వంటిల్లు కడిగేటప్పుడు ఒక బకెట్టు నీళ్ళకి కొంచెం ఫినాయిల్, ఒకస్పూను కిరసనాయిల్ వేసి కడిగితే నేల శుభ్రంగా రావడమేకాదు. దోమలూ, చీమలూ, చిమ్మటలు కూడారావు.

అద్దాలు, గాజుతలుపులు బల్బులు— చిన్న బట్ట స్పిరిట్‌లో ముంచి తుడిచి న్యూస్ పేపరుతో తుడిచేస్తే బాగా మెరుస్తాయి.

బూర్లెమూకుడు వాడితే నీళ్ళుపోసి నిమ్మకాయిడిప్ప వేసి బాగా కాగనిస్తే జిడ్డు. చల్లారాక యిట్టే కడిగేయవచ్చును.

ఇత్తడి పాత్రలు కొంచెం నిమ్మకాయ ఉప్పువేసి రాసి కడిగి బట్టతో పొడిగా తుడిచెయ్యాలి.

బట్టలకి గంజి పెట్టేటప్పుడు గంజిలో చిటికెడు ఉప్పువేస్తే — ఇస్త్రీ సులభంగా చేయవచ్చు.

— కె. రా.

| | |
|---|---|
| ప్రోటీన్ | నికోటినమైడ్ |
| లిపిడ్స్ | కెల్షియం |
| కార్బోహైడ్రేట్లు | పేంటోథెనేట్ |
| కెల్షియం | కోలిన్ |
| ఫాస్ఫరస్ | పైరిడాక్సిన్ |
| సోడియం | విటమిన్ బి12 |
| క్లోరైడ్ | ఫోలిక్ ఏసిడ్ |
| పొటాషియం | విటమిన్ సి |
| ఐరన్ | విటమిన్ డి |
| ఐయోడిన్ | విటమిన్ ఇ |
| విటమిన్ ఎ | విటమిన్ కె |
| విటమిన్ బి1 | ట్రేస్ ఎలిమెంట్లు |
| రిబోఫ్లేవిన్ | |

# మీ శరీరానికి 23 "ఆహారాలు" ముఖ్యము



## పాలలో 9 ఉన్నాయి






## కాంప్లాన్‌లో మొత్తం 23 ఉన్నాయి

(ప్రోటీన్, విటమిన్, ఖనిజాలతో కలిసి)

### కాంప్లాన్‌లో ఉన్న 23 పోషక పదార్థములు. అవి మీకు ఏవిధంగా సహాయపడతాయి

| | |
|---|---|
| ప్రోటీన్....... | జీవాణువులను తయారుచేయుటకు, మరమ్మతు చేయుటకు |
| లిపిడ్స్....... | శక్తికి ఏకాగ్ర మూలము |
| కార్బోహైడ్రేట్లు | శరీరము చురుకుగ పనిచేయు నిమిత్తము |
| కెల్షియం....... | ఆరోగ్యమైన పళ్లు, ఎముకల వృద్ధికి |
| ఫాస్ఫరస్....... | శరీరములో ద్రవములకు, ఎముకలకు, పళ్లకు అవసరము |
| సోడియమ్....... | సహజ రక్త ప్రక్రియ నిర్వహించుటకు |
| క్లోరైడ్....... | (సిఎల్ రూపములో) కండరములు, పనిచేయుటకు ముఖ్యము. తిమురులను అడగిస్తుంది. |
| పొటాషియం....... | దీని లోపమువలన మానసిక ఉదాసీనత, కండరముల బలహీనత కలుగుతుంది. |
| ఐరన్....... | (ఇనుము) ఆరోగ్యమైన రక్తము కొఱకు |
| ఐయోడిన్....... | థైరాయిడ్ సంతులితంగా పనిచేయుటకు అవసరము. దీని లోపమువలన బరువుకు సంబంధించిన సమస్యలు కలుగుతాయి; గొంతు మీద పెద్ద కాయ లేస్తుంది (గాయిటర్.) |
| విటమిన్ ఏ....... | కళ్ళను, ఇంకా పెదవులనుండి గర్భము వరకుగల అవయవములను కప్పేవ పొరను ఆరోగ్యంగ ఉంచుతుంది |
| విటమిన్ బి1....... | పెరుగుదలకు, బలమైన నరములకు, బెరిబెరి రాకుండా అడ్డగిస్తుంది. |
| రిబోఫ్లేవిన్....... | నోరు, నాలుక, కళ్ళు, ఈ అవయవములను ఆరోగ్యంగ ఉంచుతుంది. |
| నికోటినమైడ్....... | చర్మమును ఆరోగ్యంగ, కళకళలాడుతూ ఉంచుతుంది |
| కెల్షియం పేంటోథెనేట్....... | నరములను, కండరములను ఆరోగ్యంగ బలంగా ఉంచుతాయి. |
| కోలిన్....... | కార్జము ఆరోగ్యంగ పనిచేయుటకు ఇది అవసరము. |
| పైరిడాక్సిన్ (బి6) | కండరములను సడలిస్తుంది. |
| విటమిన్ బి12....... | అనీమియా (రక్తము లేమి)ను అడ్డగిస్తుంది. |
| ఫోలిక్ ఏసిడ్....... | కొత్త రక్త కణములను తయారుచేయుటలో ఉపయోగపడుతుంది. |
| విటమిన్ సి....... | శరీరములో రోగ సంక్రమణను అడ్డగించు శక్తిని పెంపొందిస్తుంది. స్కర్వి (అనగ రక్త వ్యాధి)ని అడ్డగిస్తుంది. |
| విటమిన్ డి....... | బలమైన ఎముకలకు, పళ్ళకు |
| విటమిన్ ఇ....... | అనగ సంబంధ కార్యములకు |
| విటమిన్ కె....... | మామూలుగా గడ్డలు కట్టుటకు తోడ్పడుతుంది. |
| ట్రేస్ ఎలిమెంట్లు.. | శరీరము విటమిన్‌లను లోగొనుటకు, గ్రంథులు ఆరోగ్యంగ పనిచేయుటకు ఇవి ముఖ్యము |

ఆహార లోపములు మీకు హాని కలిగించవచ్చును సంపూర్ణ ఆహారం కాంప్లాన్—మీ ఆహారానికి అది ఒక ఆదర్శవంతమైన సమర్థక పదార్థం మరియు భోజనానికి సరియైన ప్రత్యామ్నాయం

**కాంప్లాన్ ఎలా తీసుకోవాలి**

కాంప్లాన్ నీళ్లలో కలపండి. మీరు కోరితే తప్ప పాలు కలుపవలసిన అవుసరంలేదు. ఎందువలనంటే కాంప్లాన్‌లో అంతకు ముందే మీగడ తీయబడిన పాలు ఉన్నాయి సాదా కాంప్లాన్‌కు మీ కోరిక ప్రకారం వాసన కల్పించండి-కాఫీ, వనిల్లా, కేసర్ వగైరాలతో (నారింజ లేక నిమ్మపండ్ల రసంతో కలుపవద్దు) కావాలంటే పంచదార వేసుకోండి.

**కాంప్లాన్ ఎవరు తీసుకోవాలి**

ప్రపంచమంతటా లక్షలాది సంతృప్తులైన కాంప్లాన్ వాడకందార్లలో, ఎదిగే పిల్లలు, పనితో సతమతమయ్యే పెద్దలు (ముఖ్యంగా గృహిణులు మరియు ఆఫీసుపనివారలు) గర్భిణి లేక పాలిచ్చు తల్లులు ముదుసలులు మరియు ఆటగాండ్రు ఉన్నారు.

కాంప్లాన్ సులభంగా జీర్ణమయ్యే, డాక్టరు సిఫారసు చేసే సుస్తి సమయాలకు మరియు కోలుకొని

**విశ్రాంతి తీసుకొనువారికి ప్రత్యాహారం**

ముఖ్యంగా కడుపులో పుండ్లు, విరేచనాలు, జిగట విరేచనాలు లేక ఫ్లూతో బాధపడువారికి క్రొత్తగా పళ్లు వచ్చునపుడు, పళ్లు లేక ఇగుళ్ల బాధలతో మామూలు ఆహారం పనికిరానపుడు ఇది చాలా ప్రయోజనకరం

కాంప్లాన్ అలవాటు పొందండి. మీ శరీరాన్ని ఆహార లోపాల నుంచి రక్షించండి.

# కాంప్లాన్®

## అనగా సంపూర్ణ ఆహారము

ఆహార లోపములనుండి మిమ్ములను కాపాడుతుంది.

250 గ్రా.ల కాంప్లాన్ విలైన ప్యాక్

500 గ్రా.ల కాంప్లాన్ ఎకానమీ ప్యాక్




250 గ్రా.ల కాంప్లాన్ అరటి పళ్ల వాసనతో

**గ్లాక్సో**

రిసెర్చి యొక్క ప్రపంచ-ప్రఖ్యాత ఉత్పత్తి

# పిల్లలతో ప్రేమయాత్ర

రెండు బుజాలు పట్టుకుని, ఆమె కళ్ళలోకి చూస్తూ.

వెన్నెల వెలుగులో చల్లబడిన ఆమె కనుపాపలు మరింత నల్లగా, ఆర్ద్రంగా కన పడినయ్ అతనికి.

'ఏమీ లేదు. నా ఒంట్లో బాగనే ఉంది' అని సమాధానమిచ్చింది కళ్యాణి.

'మరి అలా ఉన్నావెందుకు ?' ఆమె కళ్ళ లోతులలోకి చూస్తూ అడిగేడు ప్రేమగా కాంతారావు.

'ఎందుకో యీ వాతావరణం చూస్తుంటే నా మనసు ఒక అలౌకికమైన ఆనందంతో నిండిపోయింది. నా జీవితంలో ఎన్నడూ పొందని ప్రశాంతత నన్నావరించి ఉంది యీ సమయంలో. అమాయికంగా విచ్చుకున్న యీ పూలు, క్రమబద్ధంగా పెరుగుతున్న యీ చెట్లు, నిశ్చలంగా ఉన్న యీ కోనేరు, చల్లగా ఉన్న యీ వెన్నెల, అన్నిటికన్నా మిన్నగా ప్రశాంతంగా, గంభీరంగా ఉన్న యీ ప్రదేశంలోని రాత్రి ......యివన్నీ' చూస్తుంటే యీ క్షణాలిలాగే కదలకుండా నిశ్చలంగా నిల్చిపోతే బాగుండుననిపిస్తోంది' అన్నది వేదాంత ధోరణిలో.

కాంతారావు ఓసారి చుట్టూ కలియ జూసేడు. తరువాత కళ్యాణి వదనంలోకి దీర్ఘంగా చూసేడు. వెంటనే గట్టిగా నవ్వి 'చూడు కళ్యాణీ! ఈ రాత్రి ఎంతో అందంగా ఉన్నమాట నిజమే! ఈ వాతావరణం ఎంతో ప్రశాంతంగా ఉన్నమాట అంతకన్నా నిజం. కాని యీ సౌందర్యం, ప్రశాంతత, ఊరికే వృథాగా గడిచిపోతుంటే చూస్తూ కూర్చునే శక్తి నాకు లేదు. ఈ అపూర్వ సౌందర్య సమక్షంలో, యీ పచ్చని ప్రకృతి మధ్య, యీ వెన్నెల క్రింద, యీ నిశ్చలమైన కొలను పక్క నిన్ను నాలో లీనం చేసుకోనీయ్ కళ్యాణీ!' అంటూ ఆమెను తన బిగి కౌగిలిలో బంధించివేసేడు.

అంతవరకు చల్లని వెన్నెలలోని ప్రశాంతతకు వేదాంతధోరణిని అలవర్చుకుని కరడుగట్టిన ఆమె హృదయం, తన ప్రియుని వెచ్చని స్పర్శ సోకినంతనే మెల్లగా కరిగి, మహాప్రవాహంలా మారి, వెంటనే జలపాత వేగంతో స్పందించసాగింది.

కొంతసేపు గడిచిన తరువాత యిద్దరూ ఒకరినొకరు అనుకుని, ఎత్తుగా నడుస్తూ, హోటలు రూములోకి వెళ్ళి తలుపేసుకుని నిద్రపోయేరు.

తెల్లవారేక టిఫీను తీసుకుని బయటకు వెళ్ళేరు కాంతారావు కుటుంబం. అప్పటికే రాజస్థాన్ విద్యార్థులు, ప్రొఫెసరు 'ప్లాంట్ కలెక్షన్' కోసం వచ్చి బిజీగా ఉన్నారు. వీళ్ళను చూస్తూనే 'హల్లో గుడ్ మార్నింగ్!' అంటూ అందరూ ఉత్సాహంగా ఆహ్వానించేరు.

మరుక్షణమే బాబీగాడు పాప, తల్లిదండ్రులను వదిలి ఆ విద్యార్థుల చేతుల్లోకి వెళ్ళిపోయేరు. ఆ పిల్లలకు చాక్లెట్లు, బిస్కెట్లు పెట్టి మచ్చిక చేసుకుని, ఆ పిల్లల నడ్డం పెట్టుకుని విద్యార్థులంతా ఒకటే అల్లరి చెయ్యటం మొదలెట్టేరు.

ప్రొఫెసర్‌కి మాత్రం కాంతారావు రాక చాలా ఆనందాన్ని కలిగించింది. అతని సమక్షంలో కొంతవరకైనా విద్యార్థుల బాధలు తప్పవచ్చునని అతని ఆశ.

ఫ్లవర్ హవుస్‌దగ్గర, కొలను దగ్గర, మరో జలాశయం దగ్గర, ఇండియా మాప్ ఆకారంలో పూలమొక్కలు కత్తిరించబడిన చోట, రకరకాల కోణాల్లో కాంతారావుని, కళ్యాణిని, పిల్లలను ఫోటోలు తీసేరు విద్యార్థులు.

కాంతారావు ప్రొఫెసర్‌ని, విద్యార్థులను కలిపి ఒక ఫోటో తీసేడు. ఆ ఫోటోని తాను వారితోగడిపిన రోజులకు చిహ్నంగా దాచుంచుకుంటానని అనేసరికి వాళ్ళందరికీ ఎంతో ఆనందమయింది.

గులాబీ పూలు పెంచే చోటుకు వచ్చేసరికి ఒక విద్యార్థి లేత పసుపురంగులో ఉన్న గులాబీ పువ్వుకోసి కళ్యాణికిస్తూ 'భాభీ! మీరిప్పుడు కట్టుకున్న చీరకు యీ పువ్వు బాగా మాచ్ అవుతుంది. పెట్టుకోండి' అన్నాడు.

'మీకు ఆడవాళ్ళ 'మాచింగ్'ని గురించి బాగా తెలుసునట్లుందే!' అంటూ ఆ పువ్వునందుకుని తలలో పెట్టుకుంది కళ్యాణి.

'నాకు ఒక అక్కయ్య, యిద్దరు చెల్లెళ్ళు ఉన్నారు. వాళ్ళు చీరెలు, జాకెట్లు ఏ రంగులో ఉంటే ఆ రంగులోని పూలు, ఆ రంగు గాజులు, ఆ రంగు జోళ్ళు ఉంటేనే తప్ప బయటకు వెళ్ళమంటారు. వాళ్ళ చీరలకితగ్గ మిగతా మాచింగ్ వస్తువులన్నీ తీసుకురాలేక నా ప్రాణం పోతుంది. వాళ్ళ వల్లనే 'మాచింగ్'లో మంచి ఎక్స్‌పర్టునయిపోయేను లెండి' అన్నాడు.

అతని మాటలకు అందరూ నవ్వేరు.

కాని ప్రొఫెసరుకి మాత్రం కంగారుగా ఉంది. ఇక్కడ గార్డెన్సులోని పూలు కోయటం నిషిద్ధం. ఎవరైనా చూసేరంటే ఆ కోసిన విద్యార్థికికాక చివాట్లు తనకి తగుల్తాయ్. కాని అదృష్టంకొద్దీ యెవరూ చూడలేదు,



ఐతే 'ఫ్లవర్ షాప్'లో మాత్రం బాబి గాడు పూలకుండీని దొర్లించేసరికి అక్కడ కాపలా ఉన్నవాడు గట్టిగా అరచేడు.

విద్యార్థులు అతనికంటె గట్టిగా అరచి 'చిన్న పిల్లాడికి యేమి తెలుస్తుందోయ్! ఎందుకలా గొంతుచించుకుంటావు? ఆ కుండీని కావాలంటే తీసి పైన మేమే పెడ్తాంలే!' అంటూ ఆ కుండీని యథా స్థానంలో ఉంచేసేరు.

ఇక అతను మళ్లీ కిక్కురు మనలేదు. ఎవరితోనైనా వాదనకు దిగవచ్చుకాని, విద్యార్థులతో మాత్రం వాదనకి దిగి, గెలిచినవాడు యీ భూప్రపంచంలో — అందునా యీ యిరవయో శతాబ్దంలో ఎవరూ ఉండరని అతనికి బాగా తెలుసు.

మధ్యాహ్నం పన్నెండు గంటలదాకా గార్డెన్సులో కులాసాగా కాలక్షేపం చేసేరు. తరువాత కాంతారావు దంపతులు 'వుడ్ లాండ్స్' హోటలుకి, విద్యార్థులు, ప్రొఫెసరు 'దాస్ ప్రకాశ్ హోటలుకి' వెళ్లిపోయేరు ఒకరికొకరు 'టాటా', 'ఛీరియో'లతో వీడ్కోలు చెప్పుకుంటూ.

'ఆ మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత కాసేపు రెస్టు తీసుకుని వెంటనే బస్సులో మైసూరు చేసుకున్నారు కాంతారావు దంపతులు. అక్కడ సాయంత్రం టిఫిను తీసుకుని టాక్సీలో బెంగుళూరు చేరుకున్నారు. అక్కడనుండి సరాసరి బస్సులో హైదరాబాద్‌కి వెళ్లి యింట్లోపడ్డారు.

కళ్యాణి, కాంతారావు తమ యిద్దరు పిల్లలనూ వెంటపెట్టుకుని పదిహేను రోజులపాటు చేసిన ప్రేమ యాత్ర ఫలితాలివి :

1. పిల్లలిద్దరూ ప్రయాణంలో తిండి తిప్పలూ సరిగ్గా లేనందున పీపురు పుల్లల్లా తయారైనారు. వాళ్లు కోలుకోవటానికి పది రోజులు పట్టింది.

2. కాంతారావుకి ఫ్లూజ్వరం వచ్చి మూడు రోజులు పీడించుకు తింది. ఆ తరువాత మరో పదిహేను రోజులవరకు బలహీనత ఆవరించుకుంది.

3. కళ్యాణి వస్తూనే బూజుపట్టిన గోడలను, దుమ్ముకొట్టిన యింటినీ స్వయంగా తనే శుభ్రపరచుకోవలసి వచ్చింది. వాళ్లు యాత్రలకు వెళ్లి 'ఫలానా రోజు'కి తప్పకుండా తిరిగివస్తామని పనిమనిషికి చెప్పినా, వాళ్లు వచ్చినట్లు ఆమెకు తెలిసినా, తెలియనట్లే నటించి పనిలోకి నాలుగు రోజులవరకు రాకపోయేసరికి ఆ నాలుగు రోజులూ యిల్లంతా బాగుచేసి, యింటి పనంతా చేసుకొనేసరికి నడుం నొప్పితో మూడు రోజులు పడుకోవలసి వచ్చింది కళ్యాణికి.

4. కంచిలో కొన్న పట్టు చీరను నీళ్లలో ముంచగానే పిగిలిపోయి నామరూపాల్లేకుండా చెడిపోయింది. ఆ తరువాత కొందరు మిత్రులవల్ల కాంతారావుకి తెలిసిందేమంటే యాత్రలకోసం కంచికి వెళ్లిన వాళ్లందరినీ దుకాణదారులు నాసిరకం బట్టలిచ్చి మోసం చేస్తారని, పైగా 'మీరు పదిరూపాయలు ఎడ్వాన్సుగా యిస్తే చాలు. ఇంటికి వెళ్ళి డబ్బు పంపేరంటే చీరను పార్సెలుచేసి పంపుతా'మని చెప్పి తమ మీద నమ్మకం కలిగేట్లు చెయ్యటంవల్ల యాత్రికులందరూ వాళ్ళను నమ్మి అప్పుడే చీర కొనేస్తారనీ, అథవా అప్పుడు కొనకుండా యింటికి వెళ్ళి డబ్బు పంపినా, పార్సెలులో వచ్చే ఆ పట్టుచీరకు కూడా అదేగతి పడుతుందనీ తేలింది. యాత్రికులను ఆయా దుకాణాలకు తీసుకువెళ్ళిన రిక్షావాళ్ళకి కూడా కొంత 'కమిషన్' ముడుతుందిట.

5. కళ్యాణి మైసూరు, బెంగుళూరు వెళ్లినప్పుడు శాండల్ వుడ్ సోపులు డజను, శాండల్ వుడ్ ఫేస్ పవుడరు పెట్టెలు మూడు, సెంటు సీసాలు రెండు, హెయిర్ ఆయిల్ సీసా ఒకటి, శాండిల్‌వుడ్ అగరు వత్తుల కట్ట, శాండిల్‌వుడ్‌తో చెయ్యబడిన ఫ్లవర్ వేజ వగైరా కొనటంవల్ల యిల్లంతా మంచి గంధం సువాసనలతో నిండిపోయింది కొన్నాళ్ళవరకు. ముఖ్యంగా సాయంత్రం పూట కళ్యాణి నెత్తికి మంచి గంధం నూనె రాసుకొని, సాండల్‌వుడ్ సోపుతో స్నానంచేసి, అదే పౌడరు రాసుకుని జాకెట్టు మీద అదే సెంటును చిలకరించుకుని, గదిలో అగరువత్తులు వెలిగించి, భర్త దగ్గరకు రావటంవల్ల తెల్లవారేసరికి కాంతారావు శరీరం అంతా కూడా మంచి గంధపు వాసనలను విరజిమ్ముతూండేది.

6. పైన చెప్పిన మార్పులనుండి తేరు

కోపటానికీ, అలవాట్లు పాతబడటానికి కొద్ది శ్రమ మాత్రమే పట్టింది. వీటన్నిటికన్న మరో విషయం కళ్యాణీ, కాంతారావులను ఎలక్ట్రిక్ షాక్‌లా నిరుత్తరులను చేసింది.

ఒకరోజు కళ్యాణీ, కాంతారావు కలిసి భోజనం చేస్తుంటే కళ్యాణి మధ్యలో చటుక్కున లేచి, బయటకు వెళ్ళి, భళ్ళున డోక్కుంది. ఆ చప్పుడుకు కాంతారావు కూడా బయటకు పరుగెత్తుకు వచ్చి 'అయ్యో, కళ్యాణీ! ఏమిటది? ఏమయింది?' అనడిగేడు కంగారుగా.

'ఇంకా ఏమవ్వాలండీ! నెల తప్పింది మళ్ళీ నాకు.' అంటూ భోరున ఏడ్చేసింది కళ్యాణి.

కాంతారావుకి ఆ వార్త నమ్మ శక్యం కాకుండా ఉంది. ఐనా నిజాన్ని నమ్మనంత మాత్రాన అబద్ధమవుతుందా? అందుకే అతనికి నమ్మక తప్పలేదు. ఇప్పటికే యీ యిద్దరు పసిపిల్లలతోను నానాఅవస్థలు పడుతుంటే అంతలోనే మూడోపిల్లాడా? దారుణం. ఐతే తాము అనుకున్నట్లు వచ్చే యేడు ప్రదేశాలను చూట్టానికి వీల్లేదన్న మాట. ఈ యిద్దరు పిల్లలతోనే ప్రయాణం అంత కష్టమయింది. యిక రెండు నెలల పసిగుడ్డును తీసుకుని ప్రేమ యాత్రలేం చేస్తారు?

'నిజమా కళ్యాణీ!' ఎంత పని జరిగి పోయింది!' అంటూ తల పట్టుకుని కూలబడిపోయేడు కాంతారావు. అతని కళ్ళముందు గత రెండుసంవత్సరాలలో జరిగిన కార్యక్రమమంతా కదిలింది. విటమిన్ టాబ్లెట్లు, ఐరన్ టానిక్కులు, డోకులు, చికాకులు, విద్రపట్టని ఒంటరిరాత్రులు, హాస్పిటల్లో కాన్పు, డాక్టర్లు, మందులు, నర్సులు, పని వాళ్ళు ఆ రణగొణధ్వని తరువాత కళ్యాణి బాలెంతగా మంచంమీద మూడు నెలలు పడుకుని ఉండటం అన్నీ గుర్తుకు తెచ్చుకుంటుంటేనే అతని వళ్ళు జలదరించింది.

కళ్యాణి ఏడుస్తూనే ఉంది 'నేననుకుంటూనే ఉన్నాను. ఓవారంరోజులనుండి నాకు అనుమానంగానే ఉంది. మీరు దగ్గరకు వచ్చినపుడల్లా మీ 'వాసన' నాకు గిట్టటంలేదు. సెంటు రాసుకుంటున్నపుడల్లా వాంతి వచ్చేస్తోంది. అప్పుడే అనుకున్నాను యేదో అవుతుందని. ఇంకేం, యిప్పుడు స్పష్టంగా తేలిపోయింది. మళ్ళీ ఆ తొమ్మిదినెలల వేవిళ్ళు, ఆ నరక బాధ,

# పిల్లలతో ప్రేమయాత్ర

డాక్టర్లు, అన్నీ తల్చుకుంటానికే భయం వేస్తోంది నాకు. నేను చచ్చిపోతాను నేనింక బ్రతకను ఈ ముగ్గురు పసిపిల్లలతో నేనేమాత్రం వేగలేను. ఏ విషమో తిని చచ్చిపోతాను' అంటూ ఏడవటం ప్రారంభించింది కళ్యాణి.

ఆమె ఏడుపును చూసేసరికి, తనుకూడా డీలాపడిపోవటం మంచిది కాదనిపించింది కాంతారావుకి. ఎలాగో ధైర్యాన్ని కూడదీసుకుని, కళ్యాణిని దగ్గరకు తీసుకుని ఆమె కన్నీళ్ళను తుడిచేడు. 'ఏడవకు కళ్యాణీ! ఇప్పుడు ఏడిచినందువల్ల ప్రయోజనం కూడా లేదు. చేసిన తప్పుకు శిక్ష అనుభవించక తప్పదు. మనం ఆ పదిహేను రోజులపాటు అనుభవించిన మధురానుభూతులకు ప్రతిఫలంగా యీ చిహ్నాన్ని మనం అంగీకరించక తప్పదు' అన్నాడు ఓదార్పుగా.

దాంతో కళ్యాణికి అతనిమీద ఎక్కడలేని కోపం వచ్చింది. అతని నుండి విడిపించుకుని దూరంగా వచ్చేసి, దీనికంతటికీ కారణం మీరు. ఆ పదిహేను రోజులు పిచ్చిపట్టినట్లు వళ్లు తెలియకుండా ప్రవర్తించేరు మీరు. సమయాసమయాలు చూడకుండా, చుట్టూఉన్న పరిసరాలను కూడా మర్చిపోయి నన్నొక ఆటబొమ్మగా చేసి మీ యిష్టం వచ్చినట్లు అనుభవించేరు. దీనికి మిమ్మల్ని యేంచేసినా పాపంలేదు. మీరు నా దగ్గరకు రాకండి. నాతో మాట్లాడకండి' అంటూ అరచింది.

కోపంలో ఆమె అంటున్న మాటలను వింటుంటే కాంతారావుకి నవ్వు, ముద్దు రెండూ కలిగినయ్. కళ్యాణి వైపుకు రెండు చేతులూచాచి ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. తన ఛాతీమీద ఉన్న ఆమె తలను, ఆమె బుజాలను ప్రేమగా నిమురుతూ 'పిచ్చి కళ్యాణి! ఎందుకలా ఆవేశపడతావు అనవసరంగా? మనం ఎటువడీ ముగ్గురు పిల్లలుంటే ముద్దుగా ఉంటుందని అనుకున్నాం కదా! ఒక్క తొమ్మిది నెలలపాటు కళ్లు మూసుకుంటే సరి, ముచ్చటగా మనం కోరుకున్న ముగ్గురు పిల్లలూ మన కళ్లముందు ఉంటారు. మూడోపిల్ల పుట్టగానే మనం ఫామిలీ ప్లానింగ్ పెట్టేద్దాం. నాకు ఎటువడీ యిద్దరు కొడుకులు; ఒక కూతురు కావాలని చాలా కోరికగా ఉంది. నేను గట్టిగా కోరుకున్న దేదీ జీవితంలో నాకు లభించకుండా ఎప్పుడూ పోలేదు. అలాగే యీసారి నేను కోరుకున్నట్లు అబ్బాయే పుట్టాడు. మరో విశేషం యేమిటో తెలుసా? ఈసారి పుట్టబోయే అబ్బాయి చాలా అందంగాఉంటాడు. మహాబలిపురం బీచ్‌లో, మైసూరులోని బృందావన్ గార్డెన్స్‌లో, ఊటీలోని ప్రకృతి ఒడిలో మనం పొందిన అందమైన మధుర భావాలకు చిహ్నంగా పుట్టబోయే అబ్బాయి, ఏ చీకూచింతా లేకుండా పచ్చని ప్రకృతి మధ్య రంగురంగుల పూల సమక్షంలో వెన్నెల రాత్రుళ్ళు మనల్ని ఏకంచేసిన ఆ మధుర క్షణాల ఫలితమైన ఆ అబ్బాయి గొప్ప కళాకారుడౌతాడు. నామాట తప్పక నిజమవుతుంది చూడు. ఏదీ ఒక్కసారి నా వంక చూసి నవ్వు ... ఈ పిల్లలు చిన్నతనంలో ఉండగానే మనకి అన్ని కష్టాలు. వీళ్లు పెరిగి పెద్దవాళ్లయేరంటే ముగ్గురూ ఒక్కసారి చేతికంది వస్తారు. అప్పుడు వీళ్లను వదిలేసి మనిద్దరమే హాయిగా హనీమూన్ చేసుకోవచ్చు. సరేనా? నవ్వు మరీ! గుడ్ గర్ల్! అలా నవ్వాలి' అంటూ ఆమె పెదవులమీద చిన్నగా ముద్దు పెట్టుకున్నాడు కాంతారావు

ఆ రాత్రి ఆ దంపతులిద్దరికీ ఒక లియ్యని కల వచ్చింది. 'ఆరడుగుల ఎత్తు పెరిగిన బాబిగాడు రోజూ సాయంత్రం క్రికెట్‌ఆట ఆడేంత పెద్దవాడయ్యేడు. ఒకరోజు జీన్సు, ఒకరోజు పరికిణీ ఓణీ, మరో రోజు షర్టు, లుంగీ — యిలా రకరకాలుగా డ్రెస్సులు మారుస్తూ అందాల లోకంలో విహరించే వయసులోకి అడుగు పెట్టింది పాప. మూడవవాడు రేడియో ట్యూన్‌చేసి, రంగులతో బొమ్మలువేస్తూ కూర్చునే చిత్రకారుడుగానో, చల్లని సాయంత్రంవేళ విరహగీతాలు రాసుకుంటూ కూర్చునే కవిగానో మారిన నూనూగు మీసాల యువకుడైనాడు. వాళ్లు ముగ్గురినీ యింటిదగ్గర వదిలేసి, తామిద్దరూ వయసు మళ్లినా, తరగని ప్రేమతో, చెట్టాపట్టాలేసుకుని బృందావన్ గార్డెన్స్‌లో డ్యూయెట్లు పాడుకుంటున్నారుట. మహాబలిపురం బీచ్‌లో యిసుకలో పడుకుని యీ లోకాన్ని మర్చిపోతున్నారుట!

(అయిపోయింది)




'తొలి కాన్పుకికూడా పిల్లని పిల్చుకునే అదృష్టం లేకపోయింది' అంటూ నిట్టూరుస్తూంది పక్కవీధిలో ఉన్న ఓ యిల్లాలు. 'ఏం పాపం వీరా అన్నీ సమకూరుస్తున్నారు. ఓ పది రోజులు పురుటికి తీసుకొచ్చేస్తే యీ బాధ ఉండేదికాదు కదా.' అన్నాను. 'తీసుకొచ్చేదాన్నే. కాని లోకులూ రుకుంటారుటమ్మా? ఏదో ఒకటంటారు' అంది అసలు కథ—ఇంతకీ ఆ పిల్లకి రెండో పెళ్ళి సంబంధం చేశారు. ఓ పిల్లాగాన్నాట్ట. మూడేళ్ళ వెధవ. వీళ్ళతోటే ఉంటాడట. అంచేత నిరుడు పెళ్ళయిన పిల్లకి పురిటికిముందే పిల్లాడున్నాడంటే ఏదో ఒకటి అంటారు. సవితి పిల్లాడున్నాడా? అంటే అమ్మాయి నొచ్చుకుంటుందని భయం. 'ఏం అమ్మాయికికూడా తెలియదా అబ్బాయికిదివరకో పెళ్ళి అయిందని' నా కాశ్చర్యం వేసింది. సవితి పిల్లాడిని ముద్దుగా పెంచుకుంటున్న కూతుర్నిచూసి గర్వపడవలసినది పోయి యీ పిరికి మందు పోసి ఎన్నాళ్ళు దాస్తుందీ యిల్లాలు అని పించింది.

అయినా పక్కవాళ్ళు అనేదానికోసం అనుకునే దానికోసం మనం యింతగా ఎందుకు తాపత్రయ పడతామో అర్థం కాదు. మనం చేస్తున్న పనిలో, మనం అనుకుంటున్న ఊహలలో కల్మషం ద్రోహం లేనప్పుడు—మనకి మనం నిజాయితీగా బతుకుతున్నప్పుడు – యితరులు ఏమనుకుంటారన్న భయం ఉండదు. ఈ క్షణాన్ని దురదృష్టవశాత్తూ అనుకున్న వస్తి కొనుక్కోలేక పోయినా, పక్కవాళ్ల కర్టెనుల్లాంటి అందమైన తెరలు వేయలేక పోయినా బాధపడ్డం దేనికి? ఆదేమిటో, అవసరంలేని వస్తువులు అమ్మేయడానికి తీసుకు వెడుతున్నా, ఏదో దొంగతనం చేస్తున్నట్టు యిరుగు పొరుగుల చూడకుండా దాటించేయాలని చూస్తారు. ఏదైనా పెద్ద వస్తువు రిపేరుకి పంపిస్తున్నాసరే- అమ్మేసుకుంటున్నారని అనుకుంటారేమోనని భయపడుతారు!

ఎన్నో సందర్భాలలో అనవసరం మనకి అయిష్టం అయిన పనులుకూడా చేస్తూ వుంటాం మనం. అలా చెయ్యకపోతే నామోషీ కనుక; పక్కవాళ్ళు ఏమనుకుంటారేమోనని. యిలాంటి జడదలు ఫ్రెన్ షిప్‌లో ఎక్కువగా వుంటూంటాయి. పక్కవాళ్ళు ఓసారి వస్తే — మనం ఓసారీ వెళ్ళాలి. వాళ్ళో పేరంటానికి పిలిస్తే మనం ఓ పేరంటానికి పిలవాలి. ఇంకా చూశారో లేదో—వాళ్ళింటిముందు తోట వుంటే మనం వేస్తాం. వాళ్ళు కర్టెన్లు మారిస్తే మనం మారుస్తాం. వాళ్ళ సోఫా సెట్టూ మనదీ ఒకటే. వాళ్ళు ఫ్రిజిడయిర్ హాల్లో పెట్టుకొంటే మనం అంతే! ఇంతెందుకు ఆఫీసర్ల యిళ్ళు ఒక్కటి చూస్తే ఆ కేడర్ వాళ్ళ యిళ్ళన్నీ అలాగే ఉంటాయని నిస్సందేహంగా చెప్పేయొచ్చు.

పిల్లల పెంపకం దగ్గిరనుంచి ఇరుగు పొరుగు సూచనలమీద ఆధారపడి ఎందుకుండాలో అర్థం కాదు నాకు. 'అయ్యో, మీ పిల్ల కాన్వెంటు కాదా!' అనేస్తారని ఎందుకు భయపడాలి. 'అవునండీ' అంటే పోయేదానికి, భర్తతో పేచీపడి హాయిగా చదువుకుంటున్న పిల్లను తీసుకు వెళ్ళి కాళ్ళా చేతులూ పట్టుకుని కాన్వెంటులో పడేసేదాకా ఆగదా తల్లి. తీరా 'మమ్మల్ని చూసి కాన్వెంటులో చేర్చారు వాళ్ళ పిల్లని' అంటే ఏమంటుందో చూడాలని ఉంటుంది నాకు! ఎవరేమనుకుంటారో అన్న యీ పిరికితనం మన యిష్టా యిష్టాలని స్వేచ్ఛని ఎంతగా కృంగదీస్తుందో ఎప్పుడేనా ఆలోచించారా?

సుఖంగా ఆనందంగా బతికేవాళ్ళెవరో తెలుసా? హాయిగా తమ పద్ధతిలో తాము బతుకుతూ ఎవరేమనుకుంటారోనని భయపడనివారే...ఎదురుచూడని ఎవరేనా యింటికి వస్తే భయపడిపోవడమెందుకు?...భోజనాలు చేసిన కంచాలింకా సర్దకపోవచ్చు. ఇల్లంతా చిందర వందరగా ఉండొచ్చు. హాల్లో పిల్లలు కుర్చీలు పరసపెట్టి రైలాట ఆడుకుంటూ వుండొచ్చు. వచ్చినవారికి తలుపు తియడం మానేస్తామా—ఇల్లిలా వుందని ఆవిడగారు అందరికీ టాం టాం వేసి చెప్తుందని. లేకపోతే తలుపు తీసి 'రండి రండి ఇల్లంతా యింకా అడవిలా వుంది' అంటూ ఆహ్వానించి కుర్చీ. మీదనుంచి పత్రికలూ, బొమ్మలూ తొలగించి కూర్చోమంటామా?...ఇలా వున్న మనిల్లు చూసి ఆవిడ మన స్నేహం వదులుకుంటుందా—అలాంటి స్నేహితురాలు మనకీ అక్కరలేదు. ఫరవాలేదోయ్, అంటూ సర్దుకొంటుందా—ఆవిడే నిజమైన స్నేహితురాలనుకొంటాం. నిజానికిదే కదా మనం చూసుకోవలసింది. అలా కాకుండా— మనం ఎలా ఉంటామని ఎదుటివాళ్ళు అనుకుంటారో అలావుండాలని తాపత్రయపడుతూ ఎలా ప్రవర్తిస్తామని ఎదుటివాళ్ళు అనుకుంటారో అలా ప్రవ

(64వ పేజీ చూడండి)




ఆరోజు వచ్చిన వుత్తరాలను చూస్తూ మేడ మీద వాలుకుర్చీలో కూర్చున్నారు గంగాధరంగారు రోజూలాగే, ఆయన దాన ధర్మాలను అందుకున్న వారివద్దనుంచి కృతజ్ఞతలు తెలుపుతున్న లేఖలూ, అనేక వ్యాపార సంబంధమయిన వుత్తరాలు చూసి ప్రక్కన పెడుతున్న ఆయన్ని ఓ వుత్తరం కంగారుపెట్టింది అది అతిసాధారణమయిన కాగితం మీద వ్రాయబడిన వుత్తరం. ఆత్రంగా ఆయన కళ్ళు అక్షరాల బారులపై పరుగులుతీసాయి.

ప్రియమైన మీకు,

ఇంతకంటే మిమ్మల్ని ఎలా సంబోధించాలో తెలియటంలేదు. సుమారు యిరవై సంవత్సరాల క్రితంనాటి పార్వతిని మీరు మరచిపోయివుండరనే నమ్మకంతో యీ వుత్తరం వ్రాస్తున్నాను. మీతో చెప్పవలసినది చాలా గుండెల్లో దాచుకుని, మృత్యువుకు అతి దగ్గరలోవున్న నేను యీనాడు పూర్తిగా నా ఓటమి నంగీకరిస్తూ మీ రాకకోసం వేయికళ్ళతో ఎదురు చూస్తున్నాను ప్రస్తుతం నేను వున్నది మదనపల్లి శానిటోరియంలో. మీరు ఎంత త్వరగా వస్తే అంత అదృష్టవంతురాలిని నేను.

ఒకనాటి మీ

పార్వతి.

'పార్వతీ' గంగాధరంగారి పెదాలు అస్పష్టంగా గొణిగాయి. బరువుగా వూపిరి పీలుస్తూ కుర్చీకి చేరబడి రెండుచేతుల్లో ముఖం దాచుకుని వుండిపోయారాయన.

* * *

మదనపల్లి శానిటోరియంలో పార్వతిని వెదకటం కష్టంకాలేదు గంగాధరంగారికి. కాని తీరా మంచం దగ్గరకు వచ్చేసరికి ఆమెను పోల్చుకోవటమే కష్టమయింది.

వయసు నలభైలోపు అయినా అరవైయేండ్లదానిలా వుందామె. తెల్లగా పాలిపోయి వుంది. వంట్లో ఎముకలు, వాటిని కప్పుతూ చర్మం తప్ప మనిషికి అందం, ఆకారం యిచ్చే కండ ఎక్కడా కనిపించటంలేదు. సగం తెల్లబడ్డ జుట్టు నుదుటి మీద చిందర వందర పడివుంది మూసివున్న కనురెప్పలు విశాలంగా వున్నాయి. వాటి క్రింద ఆమె గత జీవిత చిహ్నాలుగా మిగిలి వున్న నల్లని చారలు.

తడబడే అడుగులతో దగ్గరగా వెళ్ళి వణికే స్వరంతో 'పార్వతీ' అంటూ మెల్లిగా పిల్చారు గంగాధరంగారు.

నాగస్వరం విన్న నాగులా, ఏన్నాళ్ళ నుంచో ఆ పిలుపుకే వేచివున్నదానిలా, చటుక్కున కళ్ళు తెరిచిందావిడ

నాలుగు కళ్ళు క్షణంసేపు కలిసాయి. సంతోషం, తృప్తి వ్యక్తంచేస్తూ ముత్యాల్లాంటి కన్నీరు కురిసిందామె కళ్ళనుంచి. అణుచుకోలేని బాధను సూచిస్తూ ఆయన కండ్లు చెమర్చాయి.

'వచ్చారా! నాకు తెలుసు మీరు తప్పకుండా వస్తారని.'

'పార్వతీ' అంతకంటే ఆయన కంఠం నుంచి మాటలు రావటంలేదు.

'ఇలా కూర్చోండి, మీతో చాలా చెప్పాలి' అందామె ప్రక్కనేవున్న చిన్న స్టూలు చూపిస్తూ.

ఆ నుదుటి మీది జుట్టు వెనక్కు సర్ది, ఎండిపోయి పుల్లల్లావున్న ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని 'నేను వచ్చాను పార్వతీ, నిన్ను బ్రతికించుకుంటాను, ధైర్యంగా వుండు' అని చెప్పాలనిపించిందాయనకు. కాని అందుకు అవకాశం యివ్వకుండా ఆమె మాట్లాడటం మొదలెట్టింది.

'ఆయన పదేళ్ళక్రితం గుండె జబ్బుతో పోయారు. మాకంటూ ఆయన మిగిల్చింది అది ఒక పెంకుటిల్లు మాత్రమే. అప్పటి నుంచి కుట్టుమిషను మీద పనిచేస్తూ కాలం గడిపాను. మూడేళ్ళక్రితంనుంచి పట్టుకుందీ జబ్బు. ఆ వున్న యిల్లు నా వైద్యానికే చెల్లిపోయింది. నేను పోతే రాజును ఎవరు చూస్తారు......

'రాజా అంటే నీ...'

'నా ఒక్కగా నొక్క కొడుకు రాజా, వాడితర్వాత నాకు పిల్లలు పుట్టలేదు' అందామె.

గంగాధరంగారి కళ్ళు మెరిసాయి 'అంటె రాజా మన...' సగంలో ఆగిపోయారు.

ఆసక్తిగా తన కళ్ళలోకి చూస్తున్న ఆయన ముఖంనుంచి తన చూపులు ప్రక్కకు మరల్చుకుని 'అవును' అందామె.

ఆ జవాబుతో, పచ్చగా దబ్బ పండు ఛాయలోవున్న ఆయనముఖం ఎర్రబడింది. పొంగిపొరలే సంతోషాన్ని అణచుకోవటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ 'ఆ బ్బాయి యిప్పుడెక్కడున్నాడు పార్వతీ' అన్నారు.

'ఈ వూరిలోనే వున్నాడు. సత్రంలో వుంటున్నాడు, కొంచెంసేపట్లో వస్తాడు. వాడు రాకముందే మనం అన్ని సంగతులు మాట్లాడుకోవాలి' అందామె.

'ఆనాడు మీమీద కోపంతో నేను పెట్టిన షరతుప్రకారం ఆయన పోయినప్పటినుంచి కటిక దరిద్రం అనుభవిస్తున్నా మిమ్మల్ని సహాయం ఆర్థించలేదు కాని జీర్ణించిపోయిన నా రక్తమాంసాలతోపాటు ఆనాటి నా పట్టుదల కూడా మాసిపోయింది. నేనింక ఎన్నో రోజులు బ్రతకను. రాజును మీచేతుల్లో పెడుతున్నాను. వాడిని డాక్టరు చదివించండి. అయితే ఏ పరిస్థితులలోను రాజుకు మనసంగతి తెలియకూడదు. మిమ్మల్ని వాళ్ళ నాన్న స్నేహితునిగా పరిచయం చేస్తాను. మీరు అలానే ప్రవర్తించాలి. నామాట నెరవేరుస్తానని నాకు ప్రమాణం చేయండి' అంటూ చెయిచాపిందామె.

'వద్దు పార్వతీ, ఆపనిమాత్రం చేయలేను. వారసుల్లేని నాకు వరప్రసాదంలా కొడుకునిస్తూ, వాడితో 'నాన్న' అని పిలిపించుకోలేని నిర్భాగ్యుడిని చేయకు నన్ను' అన్నారు గంగాధరంగారు దీనంగా.

'మీకు పిల్లలు పుట్టలేదా'

'లేదు, సావిత్రి నోచని నోములేదు. చేయని వ్రతంలేదు, దర్శించని పుణ్యక్షేత్రంలేదు; అయినా నా పాపం యీనాటి శాపంగా మారి నన్ను తండ్రిని కానీయలేదు.

'బాధ పడకండి రాజాకు నేనంటె చాలా ప్రేమ, గౌరవం. వాడికి నా గతం తెలిసి వాడి దృష్టిలో నా విలువ తగ్గించుకోవటం నా చావు తర్వాత కూడా నేను భరించలేను. లోకానికి తెలిసినా తెలియకపోయినా మీకు తెలిసింది మీ గుండెల్లో దాచుకుని తండ్రిగా మీ కర్తవ్యం నెరవేర్చండి. అదే నాకు తృప్తి' అందామె కళ్ళు మూసుకుంటూ. ఎక్కువగా మాట్లాడటం వలన అలసి పోయినట్లుయి శ్వాస తీవ్రమయింది.

ఇక ఆవిడను మాట్లాడించటం మంచిది కాదనుకుని 'అలాగే పార్వతీ నీ మాట ప్రకారమే జరుగుతుంది' అన్నారు గంగాధరంగారు దృఢమైన కంఠంతో.

తృప్తిగా నిట్టూర్చి కళ్ళు మూసుకుందామె. అంతలో ఏదో జ్ఞాపకం వచ్చినట్లు' తరచూ మీ గురించి పత్రికలలో వ్రాసే వార్తలు చదువుతూ వుంటాను. మీ దయా గుణాన్ని మంచి తనాన్ని ప్రశంసిస్తూ వ్రాసే వ్యాసాలు, ఫోటోలు చూసి చాలా సంతోష పడేదాన్ని' అందామె.

'వారసుల్లేని ఆస్తిని మంచి పనులకు వుపయోగించటం ఏమంత గొప్పపని కాదు పార్వతీ' అన్నారాయన

అంతలో ఓ పద్దెనిమి సంవత్సరాల యువకుడు వచ్చాడక్కడకు. గంగాధరంగారి కళ్ళు అతన్ని పరిశీలనగా చూచాయి. పచ్చగా, తెల్లగా వున్నాడు. విశాలమైన నుదురు నొక్కుల జుట్టు. సన్నని మీసాల క్రింద పల్చని పెదాలు విశాలమైన కళ్ళు దిగులుతో కళావిహీనంగా వున్నాయి. ఆసక్తిగా అతన్ని పరికించిన గంగాధరంగారు 'అచ్చు తల్లి పోలిక' అనుకున్నారు మనసులో.

రెండు చేతులూ చాచి అతన్ని దగ్గరకు లాక్కుని గుండెలకదుముకుని 'నేను నీ తండ్రిని బాబూ' అని చెప్పాలనిపించే కోర్కెను తప్పవిసరిగా అణచుకుంటూ పార్వతి వైపు చూపులు మరల్చుకున్నారాయన.

తన తల్లి దగ్గర వున్న నూతన వ్యక్తినిచూసి, 'ఎవరూ' అన్నట్లు ప్రశ్నార్థకంగా తల్లివైపు చూశాడు రాజా.

'రాజా! వీరు గంగాధరంగారు. మీ నాన్నగారి ప్రాణస్నేహితులు. నేను యిక్కడ వున్నట్లు తెలిసి చూడాలని వచ్చారు' అంది పార్వతి

'నమస్కారం' వినయంగా, చేతులు జోడించాడు రాజా.

సమాధానంగా తలపంకిస్తూ 'ఏం చదివావు బాబు' అన్నారు.

'పి. యు. సి, పాసయ్యానండి.'

'ఆ తర్వాత......' అంటూ ఆగిపోయాడు.

అతను చెప్పబోయేది తనకు తెలుసు నన్నట్లు 'పర్వాలేదు బాబు, యింకా చదువుకుందుగాని' అన్నారు లాలనగా.

పార్వతికోసం గంగాధరంగారు ఎంత డబ్బు ఖర్చుపెట్టినా ప్రయోజనం లేకపోయింది. ఇక తనపని అయిపోయిందన్నట్లు ఓ ఉదయాన కొడుకువడిలో

ప్రాణం వదిలిందామె. తల్లి మరణానికి కుమిలిపోతున్న రాజును ఓదార్చి తన వెంట తెచ్చుకున్నారు గంగాధరంగారు.

* *

పుట్టినప్పటినుంచి దరిద్రాన్నే అనుభవించిన రాజును గంగాధరంగారి ఐశ్వర్యం, ఆదరణ కొంత కలవరపరచాయి. సులభంగా రాజుకు మెడిసన్ లో సీటు సంపాదించారు. ప్రత్యేకంగా అతనికొరకు ఓగది, అతని పనులు చేయటానికి ఓనౌకరు. కాలేజీకి పోయిరావటానికి కారు. ఖరీదయిన బట్టలు. తన తండ్రి స్నేహితునిగా తనపై గంగాధరంగారు చూపుతున్న అపరిమితమైన వాత్సల్యం రాజును మొదట్లో ఒక విధంగా భయపెట్టినా కాలక్రమేణా అలవాటుపడిపోయింది. అంతేగాక ఆ యింటి యిల్లాలు సావిత్రిలో తన తల్లిని చూసుకుని గతం పూర్తిగా మరచిపోగలిగాడు.

రాజుకు ఆ యింటలభించే ఆదరణలో తనూ భాగం తీసుకుంటున్నప్పటికీ, ఆ అబ్బాయిపట్ల తన భర్త ప్రవర్తనకు కారణం కనుక్కోవాలనే పట్టుదల పెరగసాగింది సావిత్రిలో.

* * *

రాత్రి భోజనాలు అయినాక, మేడమీద బాల్కనీలో కూర్చుని, ఆకాశంలో తారల్ని చూస్తూ, భార్య అందించే తమలపాకులు నమలటం గంగాధరంగారి దినచర్యల్లో ఒకటి.

# బాంధవ్యరహితులు

రోజులాగే ఆవేళ వక్కపొడి అందిస్తూ 'మిమ్మల్ని ఒకటి అడుగుతాను, నిజం చెప్తారా!' అంది సావిత్రి.

భార్య అడగబోయేదేమిటో అప్పుడే అర్థం చేసుకున్న గంగాధరంగారు ఆమె కళ్లల్లోకి చూస్తూ 'అడుగు సావిత్రీ,' అన్నారు.

'రాజంటె మీకు ఎందుకంత ప్రేమ, అతన్ని చూడందే ఒక్కరోజు వుండలేరు. ఇంతకుముందు మీ రెంతో మందికి సాయం చేసారు. కాలేజీఫీజు కట్టడమో, ఒకపూట మనింట్లో భోజనం ఏర్పాటు చేయటమో జరిగేదిగాని, యీ అబ్బాయిపట్ల మీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. ప్రతి రోజు ఉదయాన్నే స్వయంగా మీరే అతన్ని నిద్రలేపటం, రాత్రి నిద్రపోతున్న వాడ్ని చూస్తూ నిల్చోవటం నేను గమనించకపోలేదు' అందామె.

ఒక్క క్షణం మౌనంగా వుండిపోయారాయన.

'ఈ ప్రశ్న నీవడగవలసిందీ, అడగకపోయినా నేనే చెప్పవలసిందే సావిత్రీ, నీ దగ్గర నిజం దాచేశక్తి నాకులేదు సావిత్రీ, నిజం తెలిసిన తర్వాత నన్ను క్షమించినా, అసహ్యించుకున్నా నేను చేసేదేమి లేదు. రాజు ఎవరోకాదు. స్వయాన నా రక్తం పంచుకుని పార్వతికి పుట్టిన బిడ్డ' అంటూ భార్య ముఖంలోకి చూశారు. ఆయననుకున్నట్టు ఆమె ముఖం పాలిపోలేదు. కనుబొమలు ముడిపడలేదు. పైగా నిర్మలమయిన చిరునవ్వు చిందిస్తూ 'ఊ, కానివ్వండి' అంది.

'సుమారు పందొమ్మిది సంవత్సరాల క్రితం సంగతి అప్పట్లో నేను విశాఖపట్నంలో ఎం. ఎ. చదువుతున్నాను. జగన్నాథం నా ప్రాణస్నేహితుడు. చాలా పేదవాడు వాడికి కాలేజీ ఫీజు, అదీ నేనే కట్టుతుండేవాడిని. మేమిద్దరం ఓగది తీసుకునివుంటూ వుండేవాళ్లం. ఆయింటి గలవారి అమ్మాయియే పార్వతి.

పద్దెనిమిది సంవత్సరాల వయసులో, పచ్చగా, పెద్ద పెద్ద కళ్లతో, మొదటిసారి నా కంటబడినప్పుడు, చాలా చురుకయినది అనుకున్నాను. రెండవసారిచూసి ఎంతో అందమయిందనుకున్నాను. ముచ్చటగా మూడవసారిచూసి పలకరించకుండా వుండలేకపోయాను, ఆ పలకరింపు క్రమంగా, స్నేహంగా, ప్రేమగా, మారింది ఆతర్వాత హద్దులు మీరిన ప్రణయంగామారి పరవళ్లు తొక్కింది.' చెప్తున్న ఆయన మొఖంలో ఆనాటి మధురస్మృతుల జ్ఞాపకాల తళతళలు కనిపించాయి పార్వతికి.

'జగన్నాథం మొదట్నించి మమ్మల్ని గమనిస్తూనే వున్నాడు. నన్ను హెచ్చరిస్తూనే వున్నాడు. కాని పరువపు గర్వంలోవున్న నాకు వాడి నీతి బోధ చెవికెక్కలేదు. ఫలితం పార్వతి గర్భవతి అయింది. అప్పటికే నాలుగు నెలలు గడిచాయి.

పరీక్షలు అయాక సెలవలకు యింటికి వెళ్లిన నేను పార్వతిని పెండ్లి చేసుకుంటానని అమ్మకు, నాన్నకు చెప్పాను. నాన్న మాట్లాడలేదు. ఆయన చాలా గంభీరులు, పైకి తేలని మనిషి, కాని అమ్మ ససేమిరా వప్పుకోలేదు. అమ్మ సంగతి నీకు తెలుసుకదా! వట్టి పూర్వాచారం మనిషి, పైగా ఛాందసురాలు, పూజలు, మడులు, వ్రతాలు అంటూ చాలా నిష్టగావుండేది. తన కోడలు అటువంటిదే అయివుండాలి ఆమె కోరిక. అందుకే వైద్బ్రాహ్మల కుటుంబంలోకి ఒక కమ్మవారి అమ్మాయి కోడలుగా రావటానికి వప్పుకోలేదు. పైగా తనను కాదన్ని



ఆ అమ్మాయిని పెండ్లాడితే తను నియ్యా గొయ్యా, చూసుకుంటానని శపథం పట్టింది. తన చెల్లెలు కూతురయిన నిన్ను తనకోడలు చేసుకోవాలనే గాఢమయిన కోరికతో న్యాయాన్నే మరచిపోయి తటస్థంగా వుండిపోయారు నాన్న. ఓ వైపు నన్ను నమ్ముకుని కాదంటె కాలగర్భంలో కలిసిపోవటానికి తయారుగా వున్న పార్వతి. మరోవైపు తన మూర్ఖపు పట్టుదలతో ప్రాణాలు తీసుకుంటానని బెదరించే కన్న తల్లి. అటువంటి విపరీత పరిస్థితులలో జగన్నాథం నాకు దారిచూపించాడు. నేను తనకు ఆర్థికంగా చేసిన సహాయానికి కృతజ్ఞతగా చేయని నేరం మీద వేసుకుని పార్వతిని తను పెండ్లాడతానన్నాడు. విధికి తలవంచక తప్పలేదు నాకు. జగన్నాథమే స్వయంగా పార్వతికి అన్ని విషయాలు వివరించాడు. పార్వతి మొదట వప్పుకో లేదు. నన్ను అన్నివిధాల నిందించింది. మోసగాడిని, పిరికివాడిని అంది. చివరకు మరో మార్గంలేక తన గర్భంలో రూపొందిద్దుకుంటున్న బిడ్డకోసం తన నిండు ప్రాణాలు బలిచేయలేక జగన్నాథాన్ని వివాహం చేసుకోవటానికి వప్పుకుంది. అయితే నామీద కలిగిన విపరీతమయిన కోపంతో, అసహ్యంతో, జగన్నాథాన్ని తను వివాహం చేసుకున్నాక, నేను వాళ్లను ఏ పరిస్థితులలోను కలుసుకోకూడదని, తమ వునికి తెలుసుకోవటానికి ప్రయత్నించ కూడదని నా నీడకూడా వాళ్ల మీద పడకూడదని షరతులు పెట్టింది. విధికి మరోసారి తలవంచి, వాళ్ల వివాహం అయిందనిపించి బెజవాడ వచ్చేసాను. మాటకు కట్టుబడి వాళ్లను మరచిపోవటానికి ప్రయత్నించేవాడిని. కాని పార్వతి బిడ్డను అంటె నా బిడ్డను ఒక్కసారి చూసిరావాలని ఎన్నోసార్లు అనిపించేది. మరుక్షణం నిప్పులు క్రక్కుతూ రోషంతో ఎర్రబడిన కళ్లతో నిలబడ్డ పార్వతి మొఖం కళ్లకు కనబడి నా కాళ్లకు బంధం వేసేది.

ఆ తర్వాత నీతో నా వివాహం జరగటం. ఆ తర్వాత నాన్న వ్యాపారమంత నేనే చూసుకోవటం నీకు తెలిసిందే. నీవ యీ యింట కాలుపెట్టిన నాటినుం వ్యాపారంలో విపరీతమయిన లాభాలు వచ్చి ధనలక్ష్మి యీ యింట నాట్యం చేసింది. కాని పార్వతి శాపం వూరికే పోలేదు. ఎన్ని ధనధాన్యాలు వున్నా నట్టింట చిట్టిపా నడయాడలేదు. ఆ దిగులుతో అమ్మ పోవటం, ఆ తర్వాత రెండు నెలల నాన్న చనిపోవటం జరిగింది. విచారంత కృంగిపోతున్న నన్ను నీ చల్లని ఆదరణత సేదదీర్చి ఓ మంచి మనిషిగా దిద్దావు ఈనాడు సంఘంలో నా కున్న, పేర ప్రతిష్టలు పరువు, మర్యాదలు నీ వల్ల లభించినవే.

ఇన్నేళ్ల తర్వాత పార్వతి నన్ను జ్ఞాపకం చేసుకుంది. మదనపల్లి శానిటోరియంలో మరణశయ్యపై వుండి నాకు కబుర

పెట్టింది. రాజును నా కప్పగించి కన్ను మూసింది. అయితే యీ రహస్యం ఎటు వంటి పరిస్థితులలోను రాజుకు తెలియనివ్వ నని నా దగ్గర మాటకూడా తీసుకుంది. రాజా ఎటూ తల్లిలేనివాడు. తండ్రిని వుండీ చెప్పకోలేని అసమర్థుడిని. వాడిని నీ బిడ్డగా ఆదరించు సావిత్రి' అంటూ కథ ముగించారు గంగాధరంగారు.

'తప్పకుండా, మీరు రాజు విషయంలో బెంగపెట్టుకోవద్దు. వాడిని నా కన్న బిడ్డలా చూసుకుంటాను' అంటూ లేచి తమలపాకుల పళ్ళెం అందుకుంది.

అప్పటికే చాలా ప్రొద్దుపోయినందున గంగాధరంగారు కూడా లేచి ఆమెను అను సరించారు.

* * *

కిటికీలోంచి తొంగిచూసే ఉదయ భానుని లేత కిరణాల వేడికి కళ్ళు తెర చారు గంగాధరంగారు. రాత్రి జరిగిం దంతా ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. గుండెలమీద నుంచి ఏంతో భారం దింపి నట్లయింది. తృప్తిగా నిట్టూరుస్తూ లేచి క్రిందకు నడిచారాయన.

# బాంధవ్యరహితులు

ప్రతిరోజు తెల్లవారగానే క్రిందకు వెళ్ళి రాజును లేపటం, రాజు లేవగానే 'గుడ్ మార్నింగ్ సార్' అని చెప్పటం, అలా చెప్పినప్పుడు 'సార్ కాదు రాజా, డాడి అను' అని చెప్పాలని ఎన్నోసార్లు అని పించినా చెప్పలేక పోవటం గంగాధరంగారికి అలవాటయి పోయింది.

రాజు గదిలోకి నడిచిన గంగాధరంగారు అలాగే నిలబడిపోయారు. మంచం మీద రాజు లేడు. అసలు రాజు ఆ మంచంమీద పడుకున్నట్లే లేదు. పరచిన దుప్పటి కొంచెంకూడా నలిగిలేదు. టేబిల్ మీద వెండి చెంబులో నీళ్ళు కదలించకుండా అలాగే వున్నాయి. ఆ ప్రక్కనే ఓ పుస్తకం క్రింద నేనిక్కడ వున్నాను అన్నట్లు గాలికి రెపరెపలాడుతూ ఓ కాగితం ఆయన్ని పలకరించింది.

ఒక్క అడుగులో వాల్చి అందుకుని చూశారు గంగాధరంగారు.

'పూజ్యులైన గంగాధరంగారికి,

నమస్కారములు, రేపు మా కాలేజీ వాళ్ళంతా పిక్నిక్ వెళ్ళాలనుకున్నాం. అందుకు మిమ్మల్ని డబ్బు అడుగుదామని రాత్రి మీ గదికి వచ్చాను. సావిత్రమ్మ గారికి, మీకు జరిగే మాటలలో నా పేరు రావటం వలన సహజమయిన కుతూహలంతో, తప్పని తెలిసినా మీ మాటలన్ని విన్నాను. నిజం తెలిసికూడా ఆత్మవంచన చేసుకుని మీ పంచన వుండలేను. అమ్మ నా క్షేమం కోరి, తను చనిపోయాక నేను అనాథనై అష్టకష్టాలు పడతానని, ఐశ్వర్యవంతు అయిన మీ నీడన సిరిసంపదలతో నా ముందు జీవితం గడుపుకుంటాననే నమ్మకంతో, మీ సున్నిత హృదయాన్ని సాధ నగా చేసుకుని చెప్పకూడని అబద్ధం చెప్పి మిమ్మల్ని మోసంచేసింది. నిప్పులాంటి నిజం మీకు చెప్తున్నాను. నాకు ఆరేళ్ళ వయ సప్పుడు నాకంటే ఒకే సంవత్సరం పెద్ద వాడయిన గిరిధర్ అన్నయ్య మశూచికం వ్యాధితో మరణించటం, అప్పుడు అమ్మ అనుభవించిన దుఃఖం నేను మరచిపోలేదు. మీకు అర్థం అయివుంటుందనుకుంటాను. మీ రక్తం పంచుకు పుట్టిన గిరిధర్ మరణించాడు. నేను జగన్నాధం కొడు కును నా కోసం, నా సుఖంకోసం అమ్మ చేసిన నేరాన్ని క్షమించమని మిమ్మల్ని వేడుకుంటున్నాను. కన్న కొడుకునని క్షణ క్షణాన మీరు చూపే ఆదరణ, ఆప్యాయ తకు నేను అనర్హుడను. అందుకే యిల్లు విడిచి వెళ్ళిపోతున్నాను. నా కన్నతండ్రి పెట్టిన కొద్దిపాటి విద్యాభిక్షతో నా జీవి తం గడుపుకోగలననే ఆత్మ విశ్వాసంతో వెళ్ళిపోతున్నాను. నన్ను మరచిపొండి.

మీకు ఏమికాని,

రాజా,

వణుకుతున్న ఆయన చేతివేళ్ళను తప్పించుకుని అప్పుడే వీచిన పెద్దగాలికి ఆ వుత్తరం కిటికీలోంచి బయటకు ఎగిరి పోయింది. అంతవరకూ ఆ గది ప్రక్కనే వున్న జామచెట్టుమీద రామచిలుక రెక్కలు విదిల్చి రివ్వున ఎగిరిపోయింది. ●






( గత సంచిక తరువాయి )

(నాగభూషణం విచారంగా రచ్చబండమీద కూర్చుంటాడు. దేవయ్య—రహీం చెరొకప్రక్క చేతులు కట్టుకొని నిలబడి వుంటారు.)

దేవ—నన్నడిగితే కోర్టుకు కళ్ళూ—చెవులూ రెండూ లేవంటాను. లేకపోతే ఏమిటండీ యీ అన్యాయం? భూములు మీవి కావడమేమిటి? రైతులు కొలుకు దున్నుకోవచ్చని కోర్టు తాత్కాలిక యింజక్షన్ జారీచేయడమేమిటి.? ఛ.ఛ..! అంతా చుక్కెదురైంది.

నాగ— మతిలేక మీలాంటి వాళ్లను నమ్మడం వల్ల వచ్చిన అనర్థమయ్యా.. అనర్థం!

దేవ—గొర్రెలు తినే స్వరాజ్యరావు వచ్చాడనుకుంటే— బర్రెలు తినేందుకు యీ భారతమ్మ బయల్దేరిందేమిటండీ!

నాగ—ఉన్నదంతా ఎక్కడ వూడ్చుకు పోతుందోనని నేనేడుస్తుంటే మధ్య నీగోలేమిటయ్యా!

రహీం— చెప్పండిసాబ్! హత్యా చేయమంటారో..! సమయానికి మీరువచ్చి హద్దుకున్నార్ గాని... లేకపోతేనా, ఆరోజు ...నెత్తురు తాగేవాడిని.

నాగ—నోర్మూయ్! కబుర్లకు మాత్రం తక్కువలేదు. గ్రామమంతా మూకుమ్మడిగా ఎదురు తిరిగింది. కోర్టులో కేసు గెల్చారు. (పళ్ళు కొరుకుతూ.) సుప్రీముకోర్టు వరకైనా వెళ్లి....

దేవ— వాళ్ల అంతు తేల్చాల్సిందే! అన్నట్లు యిది విన్నారా? గ్రామంలో కులమతాలు వుండకూడదట! అంతా కలగాపులగం అయిపోవాలట! అందుకని...

నాగ— అందుకని ...

దేవ—ఏముందండీ! వూరి చివర ఎక్కడో వుండే హరిజనులు గిరిజనులు అంతా కలిసి ఒకే బావినీరు త్రాగాలని ప్రచారం మొదలెట్టారు.

నాగ— ఎవరూ..? భారతమ్మగారా?

దేవ—ఆ! కాక, అంతటమ్మ మరెవరికుందండీ!

నాగ— సహించరాని విషయమిది!

(భారతమ్మ వస్తూంది.)

భార—ఏది సహించరాని విషయం? సర్వం సమానత్వంగా భావించి, హెచ్చుతగ్గులు తారతమ్యాలను రూపు మాపాలనుకోవడం సహించరాని విషయమా?

నాగ— చూడండి భారతమ్మగారూ! యిలాంటి ఉపద్రవమైన పనులు చేయడం ?

భార—సహించనంటారా?

నాగ—అవును!

భార— సంఘం మారుతోంది. దేశం మారుతోంది. కాని, మీలాంటి పెద్ద మనుషులు మాత్రం మారరు. అయినా, మీలాంటి ఛాందసులతో. పనిలేదునాకు. మంచినిపెంచి— పదిమందీ సమానత్వంతో జీవించడమే మాసిద్ధాంతం! అందుకు సమితి ప్రెసిడెంటుగా— యీగ్రామ అధినేతగా చేయవలసిన సంస్కరణలన్నీ చేసి చూపుతాను. ఇందులో మంచివుందని మీకుతోస్తే నాతోచేతులు కలిపి సహకరించండి! లేదా.. మీ యిష్టం!

నాగ—ఆ!

(విసురుగా యింట్లోకి వెళ్తుంది.)

దేవ—(భారతమ్మ వెళ్లిన వేపు చూస్తూ.) సత్సాంప్రదాయం. నేల మట్టమైంది. ఇదిలా కొనసాగనివ్వకూడదు. మీరు పూనుకోకపోతే సంఘం భ్రష్టమైపోతుంది.

రహీం— హాఁ సాబ్!

దేవ— మీరలా ఉదాసీనంగా ఉంటే ఈవిడగారి ఆరాచకాలు మరింత పెచ్చు పెరిగిపోతాయి.

నాగ—అవును! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి. ఇలా రండి !

(ఇద్దరి చెవిలోనూ ఏదో చెప్తాడు. ఇద్దరూ ఆనందంగా తలలూపుతారు.)

నాగ—ఇదొక్కటే సరైన మార్గం! అవకతవకలుగా ప్రవర్తించారా?

దేవ—ఈ మెడకాయమీద తలకాయ ఉండదని తెలీదటండీ..!

నాగ—ఊ జాగ్రత్త!

(విసురుగా తనగదిలోకి వెళ్తాడు.)

దేవ—(అతను వెళ్లిన వేపు చూస్తూ గబగబా వచ్చి—భారతమ్మ యింటివేపుచూసి.) ఏమైనా గానీ అక్కడ రామమందిరం కట్టాల్సిందే!

రహీం—(కోపంగా) హేమిటయ్యా! రామమందిరం అంటున్నావ్. మాకి మసీదు కట్టాల్సినచోట మీకీమందిరం, గిందిరం అంటే ప్రాణాలుతోడ్తాను ఖబడ్దార్!

దేవ—ఇదిగో రహీం! మళ్లీ మసీదు మాటెత్తావంటే...ముందు నీకు మసీదు కట్టేస్తాను ఏమిటనుకున్నావో....

(విలియం వస్తాడు.)

విలి—ఏమిటది? ఎందుకాపోట్లాట?

రహీం—చూడు భయ్యా! ఏదీదేవయ్యా: మాట! అక్కడ జాగా యిచ్చి చనిపోయిన దాత మాకు మసీదు కట్టుకోమన్నాడు. ఆర్ని అల్లా సల్లగా సూడ! ఇప్పుడేమో మీది దేవయ్యా రామమందిరం అంటున్నాడు.

దేవ— నీకు తెలీదు రహీం! వూరికి మధ్యన తురకల మసీదు వుండకూడదయ్యా! అందుకని రాములవారి కోవెలే కట్టాలి.

రహీం— మందిరం, గిందిరం, జన్తానై! ఇక్కడ మాది మసీదు కట్టాల్సిందే!

విలి—బావుంది ! ఒకరు రామమందిరం—మరొకరు మసీదు అంటే మరి మామాటేమిటి? చనిపోయిన పుణ్యమూర్తిగారు చర్చి కట్టుకోమన్నారిక్కడ!

దేవ—పిట్టపోరూ పిట్టపోరూ పిల్లితీర్చినట్లుగా యిదింకాబావుంది. మాయిద్దరికీ తగవు తేలక మేం చస్తుంటే మధ్య మీరొచ్చి 'చర్చి' అంటారేమిటండీ!

విలి—అవును దేవయ్యగారూ! ఆస్థలంలోమీకెంత హక్కువుందో మాకూ అంతే హక్కుంది.

రహీం—అల్లా ముఖం చూసి చెప్తున్నాను. అక్కడ మాదీ మసీదు కట్టాల్సిందే !

దేవ— మీదికాని దానికి మీరెందుకు తగువులాట! ఆస్థలం రాములవారి కోవెలకని యిచ్చిందే!

విలి— అదంతా అబద్ధం. ప్రభూమీద ప్రమాణం చేసి చెప్తున్నాను. అక్కడ చర్చి కట్టడానికే హక్కుంది.

రహీం— ఆమాట మరలా అంటే రక్తం తాగుతాన్....

విలి—రహీం! మాటలు మీరుతున్నావ్! నీరవ్వు

వేషాలు సౌభాగ్గ్ర కాదు.

రహిం— హెవిన్గా అన్నాక్?

(అమాంతంగా విలియం పిడికి రాబోతాడు— సరిగ్గా అదే సమయంలో లోపల్నుంచి భారతమ్మ వస్తుంది.)

భార—ఆగండి! ఏమిటి దుర్మార్గం?

రహిం—హెవిన్గా అమ్మా! మాదిబాగాలో ఒకరు చర్చికడతారట. ఇంకొకరు రామ్మందిరం కట్టుకుంటారట.

విలి—కడతావా... కట్టి చూపిస్తావా?

దేవ—అయితే మేమేం గాజులు తొడుక్కున్నది?

రహిం— హెవ్వయ్యా! మాట్లాడుతావ్?

దేవ—నువ్వు మాట్లాడేది ఏమిటయ్యా?

భార—ఆగండి! ఆఖరికి ఈ వ్యాధి మీకూ పట్టుకుందన్నమాట! మత కలహాలతో మనిషిని మనిషి చంపుకునే దారుణ స్థితి తెలిసికూడా మీరుపోరాటానికి సిద్ధపడ్డారన్నమాట!

రహిం—అదంతా మాకే మాలుమ్ నై! అక్కడ మసీదు కట్టి తీరాలి

భార—రహిం! అనాలోచితంగా మాట్లాడకు!

రహిం—(గద్దిస్తూ) హిది మాయిష్టం!

భార—అలా ఎవరిష్టానుసారం వాళ్ళు ప్రవర్తిస్తే— యీసంఘం, యీసమైక్యత, యేమవుతుందో ఆలోచించు రహిం! ఇప్పు మసీదని, విలియం చర్చనీ, దేవయ్య రామ్మందిరం అనీ, ఎవరికి వారు వాదించుకుంటూపోతే ఏమవుతుంది? అసలు మతమంటే ఏమిటి? ఇష్టం అని కదా! దేవుడనేవాడు మనం కొలిచే రూపంలో వుంటాడు. ఆదేవుణ్ని ఎవరికి నచ్చిన పేరుపెట్టి వారు ఆరాధిస్తారు. తరిస్తారు. ప్రధానం ఆరాధనకాని, ఆలయాకారాలుకావు. అలాంటి ఆరాధ

# సమత

నకు మసీదు అయితేనేం, చర్చి అయితేనేం కోవెల అయితేనేం మతం చీలికలతో ద్వేషాలు, పోరాటాలు, పెంచుకుంటే చెడిపోయేది ఎవరు? మనం, మన వ్యవస్థ, మనసంఘం, మనదేశం, అందుకే మనమందరం సంఘటిత భావనతో కలిసి మెలిసి ఏకోన్ముఖంగా ఆరాధించుకోవడానికి అనువుగా ఆస్థలంలో ప్రార్థనామందిరం నెలకొల్పుకుందాం! శ్రమదానం చేద్దాం! సహజీవనం నెరుపుదాం!

రహిం—అఖ్ఖర్లేదు. ప్రార్థనామందిరం.పాడు మందిరం నై! మసీదు కట్టాల్సిందే: అడ్డుపడ్డ వాళ్ళని కుత్తుక కోస్తాను.

విలి—ఇది నీడి పుర్రెదు పుట్టిన బుద్ధికాదు. ఆనాగభూషణంగారి లంచంతీసుకునే అలావిజృం భిస్తున్నాడు. లేకుంటే నీడికింత దమ్ము ఎక్కడేడ్చింది?

రహిం—అరే! హెవిన్గా అన్నావ్?

(చెంపదెబ్బ కొడ్తాడు.)

విలి—ఆ! నన్ను కొడ్తావా? చూడు నిన్నేం చేస్తానో!

(అమాంతంగా తలపడబోతారు.)

భార— విలియం!

(విలియంను ఆపుతుంది. సరిగ్గా అదేసమయంలో చేతనున్న కర్రతో చావుదెబ్బ కొడ్తాడు రహిం! విలియం 'అమ్మా' అని పడిపోతాడు. బయట్నుంచి వచ్చిన రవి అదృశ్యాన్ని చూచి గబగబా ముందుకొస్తాడు.)

రవి—రహిం! ఏమిటీఘోరం?

విలి— తప్పుకోండి! నీడి అంతుతేలుస్తాను.

రహిం—అడుగు ముందుకి పడిందా..కైమా కొడ్తానుబే! ఖబడ్దార్!

భార— విలియం ఆగు! ఒకచెంపకు దెబ్బ తగిలితే మరోచెంప అందించమన్నారు మహాత్మాగాంధీ... అంటే దెబ్బతిన్నవాడు అల్పుడనీ, కొట్టినవాడు అధికుడనీ, అర్థంకాదు. మనిషిని మనిషిగా గౌరవించడం నేర్చుకోమని ఆ అంతరార్థం: తెలీక రహిం తొందర పడ్డాడు. అంతే! ఆ. రవీ! విలియంని వెంటనే ఆస్పత్రికి తీసికెళ్ళి చికిత్సచెయ్యి.

రవి—అమ్మా!

భార—మరేం మాట్లాడకు. ఆవేశంలో ఏమాట మీరినా— ప్రస్తుత పరిస్థితుల్లో ప్రళయం తప్పదు. ముందు విలియంని తీసుకుపద. ఊ.వెళ్ళు.

(అంటూ యిద్దర్నీ బయటకు తీసికెళ్తుంది. వాళ్ళ వెళ్ళాక—లోపల్నుంచి నాగభూషణం నవ్వుతూ వస్తాడు.)

నాగ—బేష్! రహిం! చక్కగాఆడావు నాటకం! దేవయ్యా!

దేవ—(చేతులు నలుపుతూ) అయ్యా!

నాగ—ఈ దెబ్బతో భారతమ్మ పనిరా! లేకపోతే కక్ష నామీద కడుతుందటయ్యా!

రహిం—సెలవీయండి సాబ్! ఏం చెయ్యమంటారో!

నాగ—ఇదే సరైన సమయం. ఆస్థలంలో రామాలయం కట్టాలని నువ్వు. లేదు మసీదు కట్టాలని రహిం — ఇద్దరి కిద్దరూ రెచ్చిపొండి. మత కలహాల పేరుతో మారణహోమం సృష్టించండి.! నరుక్కు చస్తారు. జనం, దాంతో సౌభాగ్యము, సంస్కరణం, అంతా సర్వనాశనమవుతుంది. ఆ! ఇదిగో డబ్బు..! రహీం ఈ డబ్బు నీయిష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టు. కడుపారా త్రాగు! నీవారందర్నీ తాగించు. ఆనిషాలో విజృంభించు. గృహ దహనాలు ప్రారంభించు.

దేవ—అయ్యబాబోయ్గృహదహనాలే!

నాగ— నోర్ముయ్: చెప్పేది పొంతంగావిను! (రహింతో) చూడు రహిం. ముందు నీయింటికి నువ్వు తగులబెట్టుకో.. ఆనేరాన్ని హిందువులమీదికి నెట్టివెయ్యి! అంతే! దాంతో హిందువుల్ని రెచ్చగొడ్తాడు దేవయ్య. ఇలా ఒకరిమీదొకరికి ద్వేషం, పగ, రగులుకు పోతుంది. అప్పుడు మత కలహాలు విజృంభిస్తాయి సర్వనాశన మవుతుంది. గ్రామం!

దేవ—(వగలబడి నవ్వుతూ.) ఒహోహో...ఏం బుర్రండి... మీది?

రహిం—దేవయ్యా! రావయ్యా! చూపిద్దాం మా తడాఖా!

నాగ—జాగ్రత్త' అనుకున్నది అక్షరాలా అమలు జరిపారా.... అందరి మెక్కిస్తాను లేదా ఈ రహస్యంమరో మనిషికి తెల్సిందా.. సఫా! ఖబడ్దార్! వెళ్ళండి!

దేవ—మాస్తారుగా..! (రహిం దేవయ్యాయిద్దరూ బయటకు నాగభూషణం, తనగదిలోనికివెళ్తారు).

(బయట్నుంచి భారతమ్మ, రామూ, రవియూ వస్తారు. భారతమ్మ సరాసరి లోనికెళ్తుంది.)

ఇప్పటికి వంద కథలు రాసాను - ఏనభై మా ఆవిడ పేర్న. ఎనిమిది మా చెల్లి పేర్న. రెండు నా పేర్న అచ్చయాయ్



**రవి**— ఏమైనాగానీ ఇది సహించరాని విషయమన్నయ్యా!

రాము—కావచ్చు! కాని ఆస్థలంలో హిందూ, ముస్లిం, క్రిష్టియన్లందరకీ సమాన హక్కుంది. అందుకే ఏదోలా మూడు మందిరాలనూ సమన్వయపరచి— అమ్మచెప్పినట్లు ప్రార్థనామందిరం నిర్మించుకునేలా కృషి చెయ్యాలి.

రవి—ఆలోచిస్తే అంతా నాగభూషణంగారి పన్నాగంలా కన్పిస్తోంది. ఒకవేళ దొంగ దెబ్బతీయడానికి రహీం, దేవయ్యలను యీ నాగభూషణంగానీ ప్రేరేపించలేదుగదా.

రాము—అదే నిజమైతే నాగభూషణం అంతు తేల్చాలి. అమ్మమీద, అమ్మమాటను అతిక్రమించని రైతులమీద కక్ష పెంచుకున్నాడు.

(లోపల్నుంచి భారతమ్మ వస్తూంది. చేతిలో చిన్నసంచి వుంటుంది.)

భార— అని మీరెందుకనుకోవాలి?

రాము—లేకపోతే ఏమిటమ్మా యిది? రహీం విషయం నాకు బాగా తెల్సు. నాగభూషణంగారి మద్దతులేనిదే అతనలా చెలరేగడు. పైగా విరియం సంఘసేవకుడు. విలేజి లెవెల్ వర్కరన్న విషయం కూడా గుర్తించకుండా చేయి చేసుకున్నాడంటే..

భార—సరే జరిగిందేదో జరిగిపోయింది. అదంతా ఒక పీడకలగా మర్చిపోదాం. శాంతయుత సహజీవనానికి సాధన చెయ్యడం మన ధర్మం. నేను మహిళా మండలికి వెళ్తున్నాను. శాంతంగా వుండండి.

(భారతమ్మ వెళ్తుంది.)

రవి—అన్నట్టు నాగభూషణాన్ని కనిపెట్టి వుండమని పోలీసు రిపోర్టు యివ్వడం మంచిదేమో అన్నయ్యా

రాము—వద్దు తమ్ముడూ అది కేవలం మన అపోహే అయితే అనవసరమైన అనర్థాలకు దారితీస్తుంది. ఈ భూముల తగాదా విషయం పరిష్కారం అయ్యేవరకూ మనం తొందర పడకూడదు.

(దేవయ్య ఆఘమేఘాలమీద పరుగెత్తుకొస్తాడు.)

దేవ—అయ్యబాబోయ్ కొంప మునిగింది. రక్షించాలి.

రాము—ఏమిటి దేవయ్యా?

దేవ—ఆ రహీంగాడు లేడూ వెధవన్నర..వెధవ.

ఇద్దరూ—ఆ..

దేవ— వాడుబాగా తాగి నాయింటికే నిప్పెట్టాడు..

ఇద్దరూ—(ఆశ్చర్యంగా.) ఆ!

దేవ—అయ్యబాబూ: ఇల్లు తగలబడిపోతోంది.

రవి—మరి, చూస్తూ వూరుకున్నావా దేవయ్యా!

దేవ—వూరుకోక వురెట్టుకునేదా చెప్పండి! హిందువుల యింటికి నిప్పెట్టరా అంటే.. వాడు తిన్నగా నాయింటికే పెట్టాడు నిప్పు:

ఇద్దరూ—ఏమిటీ?

రాము—ఏమిటి దేవయ్యా నువ్వంటున్నది?

దేవ—నాగభూషణంగారి ఉప్పుతినడి మోసపోయాను. అమ్మగారిమీద, గ్రామప్రజలమీద, కక్షకట్టి మతకలహాలు సృష్టించమని రహీంనీ నీ ప్రేరేపించాడు నాగభూషణం! పిల్లలు గలవాణ్ణి డబ్బుకి కక్కుర్తిపడి నేనూ ఎతులు కలిపాను. కాని, నాయింటికి రహీంచేత నిప్పెట్టిస్తాడనుకోలేదు. (ఏడుస్తూ మంటూ) సర్వనాశనమైపోయింది బాబో... సర్వనాశనమైపోయింది. గంపెడు సంసారం! ఏపెట్టుకిందికి పోను. ఏంతిని బతకను?

రాము—ఎంత ద్రోహం తలపెట్టావ్ దేవయ్యా?

రవి—అన్నయ్యా! ఇతన్ని ఏం ప్రయోజనం! ఇక్కడిలా ఆలోచిస్తూ కూచుంటే అవతల ఏం ఉపద్రవం ముంచుకొస్తోందో రా అన్నయ్యా.... వెళ్దాం!

(ఇద్దరూ బయటకి పరుగెత్తుతారు.)

దేవ—(బాధపడుతూ) అట్టా ముక్కలేక కూడా పెడుతున్నా ఉయిండ బ్రతుకు. ముందు గొయ్యి—వెనుక నుయ్యి!

(నాగభూషణం బాగా తాగి లోపల్నుంచి వస్తాడు)

దేవ—(చూచి.) అయ్యా నాగభూషణంగారూ! మీరేమి న్యాయమూ చెప్పండి! నన్ను నమ్మించి ఆఖరికి ఆరహీంచేత నాయింటికి నిప్పంటించ చేస్తారా? అక్కడ మారణకాండ జరిగి ప్రజలు గగ్గోలు పెడుతుంటే మీరిక్కడ నిషాలో కుషీ చేస్తున్నారా!

నాగ—(కోపంగా) నోర్ముయ్! నీయిష్టమొచ్చినట్టా!

మొత్తం గ్రామం గ్రామం నాశనమై పోవాలిగావి.

దేవ— మీనాశనం కోరుకునే గ్రామ వినాశనానికి దిగారు. ఇక మిమ్మల్ని ఆదేవుడేరక్షించాలి.

నాగ—నోర్ముయ్!

దేవ—అంతా అయిపోయిం తర్వాత, భయపడతాననుకున్నారా? భారతమ్మ— ఆమెకొడుకులు దేవుళ్లాంటివారు. వారి మాటలు కాదని మీతో చేతులు కలిపాను. ఆడమన్న ఆటల్లా ఆడాను. అఖరికి నాచేత గొయ్యి తీయించి, ఆగోతిలో నన్నే పూడుస్తారా? ఇక మీఆటలు సాగనివ్వను. మీరు తలపెట్టిన దుష్కార్యాలన్నీ పోలీసులకు చెప్పి మీ అంతును కనుక్కుంటాను.

నాగ—(మహోద్రేకంతో.) ఏయ్ దేవయ్యా! ఏమిటా అన్నావ్?

(కొట్టడానికి అమాంతంగా చెయ్యెత్తుతాడు. సరిగ్గా అదేసమయంలో రహీం—ఆవెనుకవిలియం పరుగెత్తుకొస్తారు. రహీం చేతుల్లోపలుగువుంటుంది.)

రహీం—(మహోద్రేకంగా.) మనకీ వదలండి హీక్కిసా వు చూస్తాన్.

విలి—(రహీంని ఆపి) రహీం ఆవేశపడకు. నామాట విను

రహీం—(కోపంగా) నహీ..నహీ..నహీ....



# సమత

నాగ—(గద్దిస్తూ) రహీం నీకేం మతిపోయిందా?

రహీం— మతిపోయింది నాక్కాదుసాబ్. మీరు నాకు డబ్బిచ్చి తాగించారు. మనసు విరిచారు. కొంపలు తగులబెట్టమన్నారు. మత కలహాలు రేపమన్నారు కానీ...కానీ...

నాగ—రహీం..

విలి—గద్దించకండి మీరాడే చదరంగంలో రహీం లాంటి అమాయకుల్ని పావులుగా ఉపయోగించుకోవాలనుకున్నారు. కాని, మీరు తలపెట్టిన మరణ హోమానికి రహీం తనబిడ్డనే బలిచేసుకోవాల్సిన దుస్థితిఏర్పడింది.

నాగ—ఆ

రహీం—అవును. పసిపిల్లల్తో ఆడుకుంటున్న నారుస్తుం బేటా నేను అంటించిన మంటల్లో చిక్కడి పోయాడు. హప్పుడూ—పాపం ఈ విలియం సాబ్ పోయి నాబిడ్డను కాపాడాడు. ఎవరిమీదయితే చెయ్యిచేసుకున్నానో..వారే అల్లాలా వచ్చి నా బిడ్డని రక్షించారు. నాదీకళ్లు తెరిపించారు.

నాగ—అందుకని.. నన్నెదిరించి మాట్లాడుతావా?

దేవ—మాట్లాడ్డం కాదు. నిజం బయటపెడ్తున్నాం.

నాగ —నోర్ముయ్..

రహీం—నోరు మూతవేసే కాలం పోయిందిసాబ్,

నాగ—అయితే ఏం చేస్తావ్?

రహీం—నీదీ ప్రాణం తీస్తాను.

నాగ—ఆ

ముగ్గురూ—అవును (అంటూ నాగభూషణాన్ని చుట్టు ముడ్తారు.)

(రాము, రవిలు ఆవేశంతో వస్తారు.)

రాము—ఇంత ద్రోహం తలపెట్టిన వాడ్ని యిలాకాదు. చేసిన తప్పులు నోటితో చెప్పించాలి. ఉండు తుపాకీ తెస్తాను.

(లోపలికి పరుగెత్తుతాడు.)

రవి—ఇక తప్పించుకోలేవు నాగభూషణం నువ్వు సృష్టించిన మంటలక్కడ చల్లబడ్డాయి — మండుతోన్న గుండెలు మాత్రం నీరక్తం కళ్లజూడందే చల్లబడవు.

(రాము తుపాకీతో వస్తాడు.)

రాము—(ఒక్కొక్కడుగూ వేసుకుంటూవస్తూ) ఇది మానాన్నగారిది. ఇప్పుడొచ్చింది దీని అవసరం? ఇంతమందిని క్షోభపెట్టావే—చెప్పు నిన్నేంచేయాలి (తుపాకీ ఎక్కుపెడతాడు.)

రవి—పేదల పెన్నిధినని చెప్పుకుంటూ! డబ్బుతో సాధించలేనిది లేదని నిరూపిగావ్: కాని, నేటికి నీ పాపం పండిపోయింది. చెప్పు! ఇప్పుడేం చేస్తావ్?

విలి—అన్నదమ్ముల్లా సహజీవనం సాగిస్తున్న మామధ్య మత కలహాలు సృష్టించావ్! చెప్పు ఇప్పుడు నిన్నేం చేయాలి

దేవ—నాకు డబ్బాశ చూపించి—కీలు బొమ్మలా ఆడించావు చెప్పు! ఇప్పుడు నిన్నేం చేయాలి?

రహీం—హంకో కసాయిని చేశావు. చెప్పు.... నిన్నేం చేయాలో చెప్పు!

అంతా (ముక్తకంఠంతో) చెప్పు! నిన్నేం చేయాలో చెప్పు?

(అంతా చుట్టూచేరి చెప్పు నిన్నేం చేయాలో చెప్పు! అంటూ రెచ్చిపోతూ తమ చేతుల్లోని ఆయుధాలను గురిపెట్టి నాగభూషణం మీదికి రాబోతుండగా— సరిగ్గా అదే సమయంలో మెరుపులా వస్తుందక్కడికి భారతమ్మ.)

భార—ఆగండి!

(ఒక్కసారి ఆగిపోతారంతా!)

అంతా—అమ్మా!

భార—ఈ మరణాయుధాలతో హత్యచేసి ప్రాణం తీస్తే— కలిగిన నష్టం భర్తీ అవుతుందనుకుంటున్నారా! ఒకర్నొకరు చంపుకోడానికా పూజ్య బాపూజీ మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించింది. (గద్దిస్తూ.) దించండి. మీ ఆయుధాల్ని! కేవలం తుపాకీ గుళ్లతోనూ విపరీత హింసలోనూ వ్యవస్థలోనూ, వ్యక్తుల్లోనూ, మార్పుతేవాలనుకుంటే— ఏ తుపాకీ గుండు మార్చగలిగింది మూడు వందల యేళ్లు భారతదేశాన్ని పాలించిన బ్రిటీషు వార్ని? ఏ తుపాకి గుండుతో సాధించుకోగలిగాం. సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని? పూజ్య బాపూజీ కలలుగన్న రామ రాజ్యం, శాంతి నెహ్రూ ఆశించిన శ్రేయోరాజ్యం వీర శాస్త్రీజీ కోరిన సర్వమానవ సమానత్వం — ఈ దేశంలో — ఈ సమాజంలో రూపొందాలంటే ఆయుధ సిద్ధాంతం కాదు. కావాల్సింది—అహింసా సిద్ధాంతం!

(అంతా తలలు వాల్చుతారు.)

భార—(అందర్నీ ఉద్దేశించి.) వారికి స్వేచ్ఛనివ్వండి! (నాగభూషణంతో) ఇక మీరువెళ్లవచ్చు కానీ, నాగభూషణంగారూ ఏనాటికైనా దేశ, కాల మాన, పరిస్థితులకు తలవంచక తప్పదని గుర్తుంచుకోండి! స్వార్థం కోసం, పదవులకోసం మనుష్యుల మధ్య మతకలహాలు సృష్టించి,వర్గ,పోరాటాలు పెంచితే దేవుడు సహితం రక్షించని విధంగా యిూ ప్రజా వెల్లువ గుణపాఠం నేర్పితీరుతుందన్న సత్యాన్ని మర్చిపోకండి! వెళ్లండి!

నాగ—(ఒక్కసారి బావురుమంటూ.) అమ్మా! భారతమ్మా, నాకళ్లు తెరిపించావు తల్లీ! నాకళ్లు తెరిపించావ్ (అందరివేపు తిరిగి.) బుద్ధొచ్చింది. ఇకపై మీతోపాటే నేనూను. నాకున్న భూముల్ని డబ్బుని మన గ్రామస్తులందరికీ పంచి యిస్తాను. మీ లక్ష్యమే నా లక్ష్యంగా గాపిస్తాను. నన్ను నమ్మండి!

(భారతమ్మ కాళ్లమీద కొరగిపోతాడు—అందరి కళ్లూ ఆనందంతో విప్పారుతాయి. తెరలోంచి—

జననీ జన్మభూమిశ్చ...
స్వర్గాదపీ గరీయసీ—

అనే శ్లోకం విన్పిస్తుంది. ఈ లోగా తెరతన పని తాను చేసుకుంటుంది.)

**(అయిపోయింది)**

గమనిక:—ప్రదర్శకులు ముందుగ రచయిత అనుమతి పొందడం విధిగా అవసరం.

బీసెట్టి లక్ష్మణరావ్.
ఆంధ్ర పత్రిక
గాంధినగర్.

## ప్రాణానికి ప్రాణంగా కలిసిపోయిన ప్రేమికులు!

రాధ వేణులు గాఢంగా ప్రేమించుకున్నారు. పెండ్లికి మనస్సులు ఒకటయితే చాలు అని నిర్ణయించుకుని, వేణు రాధ మెడలో తాళికట్టాడు. వాళ్ల వచ్చనికాపురం పాలవెలుగై, మణి దీపాల వెలుగై విరాజిల్లుతుంది. వేణులేని క్షణం రాధకు ఒకయుగము అనిపిస్తుంది.

వేణు రాధల కలయికలో యిరుమేనులు పెరినగమైనాయి. అతని గుండెల సవ్వడిలో ఆమె గుండెల గుసగుసలు వినిపిస్తాయి. ఇరువురు ప్రాణంలో ప్రాణంగా కలసిపోతారు. ఈ వుదంతం ఉషశ్రీవారి 'మానవుడు—దానవుడు'లో కనిపిస్తుంది. వేణుగా శోభన్, అతడిభార్య రాధగా శారద ఆపాత్రలుగానే మారిపోయారట,

'పసిడి మనసులు, విచిత్ర దాంపత్యం' చిత్రాలను నిర్మించిన చిన్నపరెడ్డికి 'మానవుడు—దానవుడు' మూడవ విజయాన్ని తెచ్చిపెడుతుంది. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వాన్ని, సుకదేవ్ ఛాయాగ్రహణాన్ని, అశ్వద్ధామ సంగీతాన్ని, సూరన్న కళా దర్శకత్వాన్ని నిర్వహించిన యీ చిత్రంలో కృష్ణకుమారి, సత్యనారాయణ, రాజబాబు, ముక్కామల, అర్జా జనార్దనరావు, జయకుమారి జ్యోతిలక్ష్మి ప్రధాన పాత్రలను పోషించారు. ఈ చిత్రం త్వరలో అఖిల్ ప్రభాస్ద్వారా నవయుగ విడుదల చేస్తారు.

## తిరుమల దేవుని భక్తురాలు జమున

సుశీల సాధుశీల. పరమభక్తురాలు, నిత్యం దీపధూప నైవేద్యాలతో తిరుమలనాథుని పూజించడమే సుశీలయొక్క మొదటి దినచర్య. ఆ దేముని సుందరరూపాన్ని, ఆయన మహాత్మ్యాన్ని నోరార పాడనిదే సుశీలకు ప్రొద్దుపోదు — వెంకటేశ్వరుని పై సుశీల ఒక అందమైన, మధురమైన పాటను పాడింది. ఏమని ?

'తిరుమల మందిర సుందరా,
సుమధుర కరుణా సాగరా



'బీదలపాట్లు'లో చంద్రకళ, నాగేశ్వరరావు, చంద్రమోహన్.

# సినిమా

ఏపేరున నిను పిలిచేమురా
ఏరూపున నిను కొలిచేమురా'— ఈ పాటను సుశీల పాత్రధారిణి జమున రవి శంకర్ పిక్చర్స్‌వారి 'మేనకోడలు' చిత్రంలో ఆలాపిస్తుంది కవి దాశరధి మది అందించిన ఈపాటను సుశీల తన కోయిల కంఠంతో పాడి, పాటయొక్క భావానికి రెట్టింపు విలువను ఆపాదించింది. ఘంటసాల సంగీత దర్శకత్వంలో వెలువడిన మంచి పాటల్లో యిదొకటి ఈ చిత్రానికి బి ఎస్ నారాయణ దర్శకుడు.

'మేనకోడలు' చిత్రంలోని ముఖ్య భూమికలను కృష్ణ, గుమ్మడి, రాజబాబు, సత్యనారాయణ, నల్లరామూర్తి, సూర్యకాంతం, రేణుక, రోజారమణి, శ్రీదేవి ధరిస్తున్నారు. నాయిక పాత్రను జమున



'మానవుడు—దానవుడు'లో శారద, శోభన్‌బాబు.



'అమ్మమాట'లో నాగయ్య, వాణిశ్రీ.

పోషించే యీ సాంఘికానికి వై. సునీల్ చౌదరి నిర్మాత. అనిల్ ప్రభాకర్ పంపిణీదారులు. నవయుగ విడుదల

## తెలుగు చిత్రంలో నాగేష్

ఎస్. ఆర్. కంబైన్స్ నిర్మిస్తున్న సెంటిమెంటల్ క్రైమ్ థ్రిల్లర్

## సినిమా

ఊటీ ఔట్‌డోర్ షూటింగు పూర్తయినట్లు, నిర్మాతల్లో ఒకరయిన ఎస్. వి. సుబ్బరాజు వెల్లడించారు. ఈ చిత్రానికి కె. యస్. ఆర్. దాసు దర్శకుడు. ఆంధ్ర జేమ్స్‌బాండ్ కృష్ణ నాయకుడు, సెక్స్



'రంగన్న శపథం'లో శివాజీగణేశన్, పద్మిని.

బాంబ్‌షెల్ జ్యోతిలక్ష్మి నాయిక. తమిళ నటుడు నాగేష్ ముఖ్య పాత్ర వహిస్తున్నాడు.

## తెలుగు, తమిళ నిర్మాతలు కలసి నిర్మిస్తున్న చిత్రం!

నిర్మాత లిద్దరికీ సినిమా పరిశ్రమలో ఇరువదేండ్ల అనుభవమున్నది. ఎస్. వి. సుబ్బరాజు ఫల్గుణా సంస్థలో భాగస్వామి. ఎమ్. కె. రాధ తమిళ చిత్రాలను నిర్మిం-



'నీతి—నిజాయితీ'లో

ఛాయాదేవి, నాగభూషణం.

చిన వ్యక్తి. వీరిద్దరూ కలసి ఎస్. ఆర్. కంబైన్స్‌ను స్థాపించారు. వీరి క్రైమ్ చిత్రం అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది.

పై చిత్రానికి దాసరి నారాయణరావు రచన, కన్నప్ప ఛాయ నిర్వహించారు. ముఖ్యపాత్రలను కృష్ణంరాజు, సత్యనారాయణ, రాజబాబు, సుకన్యామతి, అనిత, జయకుమారి, రాజసులోచన పోషించారు.

అవుట్‌డోర్ షూటింగు ఫిబ్రవరి మాసాంతంలో కాగలదట. రికార్డింగు జరిగిన పాటలన్నీ చిత్రీకరించబడ్డాయి. క్లయిమాక్స్ హైలైటే అని నిర్మాత ఎస్. వి. సుబ్బరాజు అన్నారు.

## బీదలపాట్లు

'బీదలపాట్లు' కథ యిదివర కొకసారి వచ్చివుంది. విఠలాచార్య నిర్మిస్తున్న ఈ చిత్రంలో అనేకమయిన మార్పులు చేర్పులు చెయ్యబడ్డాయి. స్క్రిప్టు చక్కగా



'కన్నతల్లి'లో చంద్రకళ.

వున్న యీ చిత్రానికి డి. వి. నరసరాజు వ్రాసిన సంభాషణలు ప్రాణం పోసాయి. చిత్రంలో వున్న నాలుగు పాటలకు సన్నివేశ ప్రాధాన్యతవుంది. మహదేవన్ వాటన్నింటికీ మంచి బాణీలని సమకూర్చారు. ఛాయాగ్రహణాన్ని ఎస్. వెంకటరత్నం నిర్వహించారు. ఆయన ప్రతిభ మీకు తెలియనిదా? ఈ చిత్రంలో కొత్త విఠలాచార్య కనిపిస్తారు.



'సంపూర్ణ రామాయణం'లో శోభన్‌బాబు, చంద్రకళ.

ఖాదీ కోటయ్యగా, దయానిధిగా, పురుషోత్తంగా నాగేశ్వరరావు నటన శిఖరాగ్రాన్నందుకుంది. కొన్ని దృశ్యాల్లో ప్రేక్షకుల చేత కంట తడిపెట్టిస్తారు అక్కినేని. జావర్‌గా గుమ్మడి గంభీరంగా కనిపిస్తారు. ముఖ్య పాత్రధారులయిన సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రావు గోపాలరావు, కృష్ణకుమారి, చంద్రకళ, విజయలలిత,



'మంచివాళ్ళకు-మంచివాడు'లో విజయనిర్మల.

# సినిమా డైరీ

● 'మంచివాళ్లకు మంచివాడు' చిత్రానికి శ్రీశ్రీ వ్రాసిన పాటను, ఫిబ్రవరి 1వ సత్యం సారథ్యంలో ఎస్ పి బి పాడారు (విజయాగార్డెన్ రికార్డింగు థియేటర్లో)

● ఫిబ్రవరి 1తో విజయలక్ష్మీమూవీస్ వారి 'అమ్మమాట' షూటింగు పూర్తయింది. ఆఖరి కాల్‌షీట్లో శోభన్, వాణిశ్రీ పాల్గొన్నారు వి రామచంద్రరావు దర్శకుడు

● ఫిబ్రవరి 3వ హైదరాబాద్ రాజభవన్‌లో ప్రధానమంత్రి ఇందిరాగాంధికి అక్కినేని అధ్వర్యంలో రక్షణనిధికి విరాళాలు ఇవ్వబడ్డాయి

● శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్ వారి 'పసం పసివాడు' ఇన్‌డోర్ షూటింగు జనవరి 31 నుండి ఫిబ్రవరి 3 వరకు వాహినీలో 7వ ఫ్లోర్‌లో జరిగింది వి రామచంద్రరావు దర్శకుడు

● వందనా ఫిలింస్‌వారి 'ఇల్లు—ఇల్లాలు' షూటింగు జనవరి 30 నుండి ఫిబ్రవరి 3వరకు వాహిని 6వ ఫ్లోర్‌లో జరిగింది వి చంద్రశేఖరరెడ్డి దర్శకుడు

● రవిశంకర్ పిక్చర్స్ వారి 'మేనకోడలు' షూటింగు జనవరి 27 నుండి ఫిబ్రవరి 5 వరకు వరకు విక్రమ్ స్టూడియోలో జరిగింది బి ఎస్ నారాయణ దర్శకుడు

సూర్యకాంతం పాత్రోచితమైన నటన్ను

## సినిమా

ప్రదర్శించారు అన్నిహంగులు వున్న 'చిదంబ ఒప్పిస్తుందనే నమ్మకం నాకు కలిగింది

హిట్స్' అన్ని తరగతుల ప్రేక్షకులను మార్చిలో మీరూ (అన్నపూర్ణాద్వారా)



'ఇల్లు—ఇల్లాలు'లో వాణిశ్రీ.

చూస్తారుగా!

## ప్రేమికుల జీవితంలో పెనుతుఫాను

అమర్ గౌరీలు ప్రేమించుకున్నారు. పెండ్లాడుదామని బాసచేసుకున్నారు కానీ విధి ఆడిన ఆటవల్ల ప్రేమికుల జీవితంలో పెనుతుఫాను చెలరేగింది. ప్రమాదంలో అమర్ మరణించాడన్న విషాద వార్తను గౌరి విని నిశ్చేష్టురాలైంది. అప్పటికే గౌరి గర్భవతి.

గౌరికి అపనిందలు రానీకుండా మానవత్వం వున్న శ్రీనివాసరావు గర్భవతిని తనదాన్నిగా పరిగ్రహించాడు. తనదికాని శిశువుకు తండ్రై ఆ పాపే తన కనుపాపగా తన ప్రాణంగా పెంచాడు.

ప్రమాదంలో మరణించా డనుకున్న అమర్ తిరిగి వచ్చాడు. ఒకరోజున తన బిడ్డను అకస్మాత్తుగా చూస్తాడు. ఆప్యాయత, అనురాగం వెల్లివిరిసి, నాసీని ఎత్తుకున్నాడు. హృదయం ఆనందాబ్ధిలో మునిగింది. సంతోషంతో అమర్ నాసీని దీవించాడు ఏమని ?

'నువ్వోనువ్వో జతగ
నేనూ నువ్వూ ఒకకథగ
పిండుగ నూరేళ్లుండాలి–నీ
బ్రతుకొక పండుగ కావాలి'

అని తనబిడ్డ అని తెలియకుండానే ఆశీర్వదించాడు. కన్నప్రేమకి యిదొక చక్కని ఉదాహరణ కన్నప్రేమ, పెంచిన ప్రేమల మధ్య జరిగే సంఘర్షణ సారమే మాధవీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌వారి 'వంశోద్ధారకుడు' కథ అమర్‌గా శోభన్ గౌరిగా కాంచన, శ్రీనివాసరావుగా ఎస్వీరంగారావు, నాసీగా డాలీ నటించారు.

'పాండవ వనవాసము' చిత్రాన్ని అందించిన ఏ ఎస్ ఆర్ ఆంజనేయులు 'వంశోద్ధారకుడు' నిర్మాత పి. సాంబశివరావు (దర్శకత్వాన్ని), ఘంటసాల (సంగీత సారథ్యం), మారన్న (కళను), గోపాలరావు (కూర్పును), ఎస్ ఆర్ నంది (సంభాషణలను) నిర్వహించిన ఈ చిత్రంలో రావి కొండలరావు, రావు గోపాలరావు, మాడా, ప్రసన్నరాణి, మాలతి ముఖ్య పాత్రధారులు. కె. ఎస్. ప్రకాశరావు, అంజలీ దేవి అతిథి నటులు. విశాలాంధ్ర అంతటా లక్ష్మి ఫిలింస్ విడుదల.

## మీకు తెలుసా?

దర్శకుడు కె. హేమాంబరధరరావు గారి అధ్వర్యంలో 'సినిమా' పత్రిక వెలువడుతుంది.

హేమాంబధరరావుకు స్వంతమైన సుభాషిణీ థియేటరును హీరో శోభన్ కొన్నారు.

సినిమా కవి ఆత్రేయాచార్య వడపళనిలోని గంగయ్యమ్మన్ కాలనీకి తమ మకాంను మార్చారు.

డబ్బింగు చెప్పే సూర్యప్రకాశరావు పాండీబజారులో ఉత్తరాది సోగాకు దుకాణం పెట్టారు.

హాస్యనటుడు రాజబాబు సహోదరికి ఫిబ్రవరి 5న వివాహం జరిగింది.

విజయలక్ష్మి జి. వి. ఎస్ రాజుకు ఒకప్పుడు కడపలో గాజు ఫ్యాక్టరీ వుండేది.

## రాజమండ్రిలో తాసిల్దారుగారి అమ్మాయి శత దినోత్సవ సభ

సత్యచిత్ర నిర్మించిన 'తాసిల్దారుగారి అమ్మాయి' శోభన్ నట జీవితాన్ని పెంచిన చిత్రం. క్లిష్టమైన రెండు పాత్రలను పోషించి, ప్రజల ఆశీస్సుల నందుకున్నారు శోభన్. ఈ చిత్రం ఆరు కేంద్రాల్లో నూరు దినాలు విజయవంతంగా నడిచింది. శత దినోత్సవ సభను ఫిబ్రవరి 19 న రాజమండ్రిలో జరపడానికి నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణ నిశ్చయించారు ఈ సభకు నటసామ్రాట్ నాగేశ్వరరావు అధ్యక్షత వహించి, నటీనటులకు, దర్శక, తదితర సాంకేతిక నిపుణులకు బహుమతీ ప్రదానం చేస్తారు. మొదటి ప్రయత్నమే యువ నిర్మాతలకు పుత్సాహాన్ని, అత్యధిక లాభాల్ని తెచ్చి పెట్టింది. ఈ ఫంక్షన్ లక్ష్మి పంపిణీదారులు, సత్యచిత్ర నిర్మాతలు భారీ ఎత్తున చెయ్యడానికి నిర్ణయించారు. మద్రాసునుండి వెండితెర ప్రముఖు లనేకులు ఈ ఉత్సవంలో పాల్గొనగలరని తెలుస్తుంది.

## లక్ష రూపాయల పాట!

ఫిబ్రవరి 1 న నిర్మాత ఎస్. భావనారాయణ 'మంచివాళ్లకు మంచివాడు' చిత్రానికిగాను విప్లవ కవి శ్రీశ్రీ విరచితమయిన నేపథ్య గీతాన్ని రికార్డింగ్ (విజయా గార్డెన్సులో) జరిపించారు.

'లేనే లేదా, అంతం లేనే లేదా!
రానే రాదా, విముక్తి రానే రాదా
బలవంతులకు, నరహంతకులకు
బలి కావాలా, మానవతా'—

ఈ పాటకు అరవై మంది వాయిద్య బృంద సహాయంతో సంగీత సారధి సత్యం బాణీ సమకూర్చగా, బాలసుబ్రమణ్యం భావావేశంతో పాడి, పాటను రక్తి కట్టించారు.

రాజస్థాన్, ఉదయపూర్ లొకేషన్సులో పై పాట హీరో కృష్ణపై చిత్రీకరించబడుతుంది. ఈ పాట రికార్డింగుకు చిత్రీకరణకు లక్ష అవుతుందని తెలుస్తోంది. 'మంచివాళ్ళకు మంచివాడు' చిత్రానికి శ్రీశ్రీ పాట ఆయువు పట్టయిన పాట అనడం ఉచితం. కె. ఎస్. ఆర్. దాసు దర్శకత్వంలో తయారయ్యే యీ పూర్తి రంగుల చిత్రంలో విజయనిర్మల నాయిక. 'మోసగాళ్ళకు మోసగాడు' తర్వాత కృష్ణ సమర్పించే మరొక వండలన చిత్రమే 'మంచివాళ్ళకు మంచివాడు.'



నటి కాంచన (చిత్రకారుడు : శ్రీ ఎం. ఆర్. ఎన్. ప్రసాదరావు.)

# సినిమా

## పాటకోసం!

విజయలక్ష్మీ మూవీస్ నిర్మించిన 'అమ్మ మాట' షూటింగు ఫిబ్రవరి 1 తో పూర్తయింది. ఒక్కపాటకోసం మూడు మాసాలు ఆగిన నిర్మాత జి. వి. ఎస్. రాజుగారి ఓపికను మెచ్చుకోవాలి.

ప్రేక్షకులు 'అమ్మమాట'పై ఆశలు పెంచుకుని ప్రతినెలా విడుదలవుతుందని గత మూడుమాసాలుగా ఎదురు చూస్తున్నారు. ఫిబ్రవరి 25 న తప్పక విడుదల అవుతుందని నిర్మాత జి. వి. ఎస్. రాజు వెల్లడించారు.

భమిడిపాటి కలం, రమేష్ సంగీతం, శోభన్ వాణిశ్రీల నటనా ప్రాభవం 'అమ్మ మాట'కు జీవం. వి. రామచంద్రరావు దర్శకత్వం నెరపిన యీ కుటుంబగాథకు మహిళల ఆదరణ మెండుగా లభించడం ఖాయం. ముఖ్యపాత్రలను నాగభూషణం, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రాజబాబు, సావిత్రి, లీలారాణి, సుజాత ధరించారు. ఈ చిత్రం అనిల్ ప్రభాస్ ద్వారా నవయుగ విశాలాంధ్రలో విడుదల చేస్తారు.

## మూడవ చిత్రం

విజయలక్ష్మి మూవీస్‌వారి మూడవ చిత్రానికి పేపరువర్కు జరుగుతూవుంది. భమిడిపాటి కధకుడు, జి. వి. ఎస్. రాజు నిర్మించే యీ చిత్రంలో శోభన్ నాయకుడు: వాణిశ్రీ నాయిక. షూటింగు జూన్‌లో ప్రారంభ మవుతుంది.

## జెమినీ ఔట్‌డోర్

జెమినీవారి ఈస్ట్‌మన్ కలర్ (సాంఘిక) చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ జనవరి 11 నుండి 17వరకు విజయవాడ పరిసర ప్రాంతాలలో జరిగింది. 11వ తేదీన పులిపాకలోను, 12వ తేదీన ఈడ్పుగల్లు, 13వ తేదీన వడ్డీశ్వరం 15వ తేదీన ఇబ్రహీం పట్నం, 16వ తేదీన ఎనమలకుదురు, 17వ తేదీన సీతానగరం, ఉండవల్లి ప్రాంతాలలో రెండు పాటలు చిత్రీకరణ చేశారు.

'ఏటేట వస్తుంది సంక్రాంతి ......' అన్న పాటను నాగేశ్వరరావు, కాంచన, గీతాంజలి మరియు డాన్సర్స్ పై చిత్రీకరించారు. ఈ పాటను కొసరాజు రచించారు

తరువాత, రెండవ పాట, 'ఎగిరే గువ్వ ఏమంది......' అన్నపాటను కాంచనపై 15, 16, 17 తేదీలలో ఇబ్రహీం పట్నం, ఎనమలకుదురు, సీతానగరం, ఉండవల్లి ప్రాంతాలలో చిత్రీకరించారు. ఈ పాటను సి. నా. రె. వ్రాశాను.

టి. చలపతిరావు సంగీతదర్శకత్వములో మెరుగులు దిద్దుకుంటున్న యీ రంగుల చిత్రంలో నాగేశ్వరరావు, కాంచన, గీతాంజలి, గుమ్మడి, నాగభూషణం, కృష్ణంరాజు, ధూళిపాళ, సత్యనారాయణ, అంజలీదేవి, నిర్మల, ఝాన్సీ నటిస్తున్నారు. రచన శ్రీ బొల్లిముంత శివరామకృష్ణ. ఫొటోగ్రఫీ సెల్వరాజ్ స్టూడియో జెమినీ. శ్రీ వి. మధుసూదనరావు దర్శకత్వం వహిస్తున్న యీ చిత్రం నవయుగ ద్వారా విడుదల కాగలదు.

## రంగన్న శపథం

తమిళంలో 'ఇరుధువవ్' పేరిట విడుదలై ఆదేశ ప్రజలను మెప్పించిన చిత్రం యొక్క తెలుగు రూపమే 'రంగన్న శపథం'. వరదరాజా ప్రొడక్షన్స్ పూర్తి రంగుల్లో నిర్మిస్తున్న యీ చిత్రం త్వరలో విశాలాంధ్ర అంతటా విడుదలవుతుంది.

'తన స్వంత తమ్ముని సౌఖ్యం కోసం ఎన్నో కష్టాలనెదుర్కొని నిస్వార్థంగా తన సర్వస్వాన్నీ త్యాగం చేసిన అన్నగారి అపూర్వ ఆదర్శమే' యీ చిత్రానికి ఇతివృత్తం. శివాజీ గణేశన్ నాయకుడు; పద్మిని నాయిక. నాగేష్ నవ్వించే నవ్వులు 'రంగన్న శపథం'కు అదనపు ఆకర్షణలు. సహాయ పాత్రలను రాజశ్రీ, ముత్తురామన్, పి. ఎస్. వీరప్ప నిర్వహిస్తున్నారు.

పై చిత్రానికి కె. గోపాలరావు రచన్ను, విశ్వనాథన్, చాంద్ సంగీతాన్ని, విన్సెంట్ ఛాయను, కోటగిరి గోపాలరావు కూర్పును నిర్వహిస్తున్నారు. యీ కుటుంబ గాథాచిత్రానికి ఎస్. పి. రామనాథన్ దర్శకుడు. కొత్త పోకడలతో సాగిపోయే యీ చిత్రానికి కె. గోపాలరావు కలం బాగా పని చేసిందట.

—శ్రీనివాస్ ●

# పుస్తకాలు

అదీ భేదం. సీత 'బావా!' అంటూవుంటుంది గోపాలాన్ని. ఇందులో కొంత శృంగారం. కొంత దేశభక్తి.... యిలాంటివన్నీ వున్నయ్. శలవులకు యింటికొచ్చి సీతలో కనిపించిన మార్పుని గమనించి 'ఏదో ఘన కార్యం చేశావటగా' అంటాడు గోపాలం బావ. క్రొత్తదనం అంటూ యేదైనా యిందులో వుంటే అది 'ఛీ—పో బావా' అని సీతచేత అనిపించకపోవటం. సీత క్రింది పెదవిని పళ్లతో కొరుక్కుంటుంది.... అంతే..... ఫ్లాష్‌బాక్‌లో యివన్నీ జరిగాక దేశభక్తిని లాక్కురాందే కథ అవ్వదన్నట్టు 'దేశరక్షణనిధికి విరాళాలు' అన్న నినాదాలు చేస్తాడు రచయిత. ఇవన్నీ అయ్యాక సీతను రైలెక్కిస్తాడు గోపాలం బావ. తమ చుట్టూవున్న ప్రభావాలకు—సినిమాలుకానీండి, యితర రచనలు కానీండి— అతీతంగా వున్న వ్యక్తుల నుంచే క్రొత్త రచనలు వస్తూవుంటయ్ మరి.

ఇందులో కొందరు రచయిత(త్రు)ల పట్ల పాఠకలోకం తప్పకుండా ఆశలు పెంచుకుంటుంది. క్రొత్తగా వస్తున్న రచయితలు క్రొత్తపంథాలు యెన్నుకోవాలిగానీ యింతవరకూ వస్తున్న పూకదంపుడు కథల మాదిరే వ్రాయకూడదు. అయినా సామర్థ్యంగల వీరు మరొకర్నెందుకు అనుకరించాలి! తామే క్రొత్తదారులు త్రొక్కగలరు. వీరికి ఆ ధైర్యం, యిందులో కొంత క్రొత్తదనం వున్న కథలకు పాఠకులు చూపించే ప్రోత్సాహం, ఆదరణలు నుంచే వస్తుంది.

—శ్రుతధారి

## ధనమూలమిదం జగత్

రచయిత: రంగధామ్, ప్రకాశకులు. యం. శేషాచలం అండ్ కో, వెల: రూ. 2.50.

ఈ నవలలో బోధపడని విషయాలు చాలా వున్నాయి. వాటిలో ముఖ్యమయినది యీ నవలకు ధనమూల మిదం జగత్ అని పేరుపెట్టిన కారణం. నవల నిండా ముమ్మరంగా ఫాక్టరీ గొడవలు వస్తే రాలున్నాయి. అసలు కథ ఏమాత్రం లేనందువల్ల ఆకథని నవలగా పెంచడానికి పడిన శ్రమ ప్రతి పేజీలోనూ కనుపిస్తుంది. శర్మ అనే యువకుడు రాగిణి అనే అమ్మాయిని తీవ్రంగా ప్రేమించి ఆనక తన తలిదండ్రుల నెదిరించి నిలబడలేక ఆమెను ఒదులుకుంటాడు. అవిగాదట తన తలిదండ్రుల సంగతి, తన సమర్థతా తెలిసినా కూడా లత అనే మరోపిల్లని ప్రేమించి, ఇంట గెలవలేక, తనను నవమాసాలుమోసి, కని పెంచిన తల్లిని, తనకోసం ఎంతో శ్రమపడిన తండ్రిని కాదనే శక్తి తనకు లేదని తెలుసుకుని అంతేగాక ప్రపంచంలో డబ్బుకు మనిషికన్నా ఎక్కువ విలువ వున్నది, కట్నాలు కానుకలతో వచ్చే అమ్మాయి ముందు పేదరికంలో మునిగివున్న లతకు ఎక్కువ విలువ నివ్వడం సమంజసం కాదేమోనని కూడా ఆలోచించి లతను పెళ్ళాడడం మానేస్తాడు. జీవనోపాధి కోసం, వున్న వూరువదిలి మధ్యప్రదేశ్ వెళ్ళిపోతూ లత తనకురాసిన వుత్తరం చూసుకున్న, విటువార్చి, 'ఎప్పటికైనా నీకోసమే ఎదురుచూస్తుంటాను లతా' అంటాడు. ఈ రెండు సంఘటనలనూ ఎలా సమాధాన పరచుకొని శర్మ అంతర్యం బోధ పరచుకోవాలో చదువరికి బోధ పడదు. లత మీదికి మనస్సు మారేముందు శర్మ లక్ష్మి అనే మరో అమ్మాయిని మచ్చిక చేసుకోవడానికి శత విధాలా ప్రయత్నించి, కుదరక, ఆమె స్నేహితురాలైన లతమీదికి సింపాదిగా తన దృష్టి మళ్ళించి యీమెకూడా పరవాలేదు. బాగానేవుంది. అనుకుంటాడు.

కథలో పట్టు ఏమాత్రం లేదు. ఇతివృత్తం చాలా చిన్నదవడం వల్ల, ఫ్యాక్టరీ గొడవలు చాలా ఎక్కువగా వుండడం వల్ల చదువరికి కాస్త విసుగు కలిగిస్తుంది. ఎటొచ్చి రచనా విధానంలో కొన్ని తత్వం వుండడం, అతిశయోక్తి పద్ధతి సంఘటనలు లేకపోవడం కాస్త సంతోషించాలి విషయం.

—పాలాక్షి

## సత్యజ్ఞానం

ఆధ్యాత్మిక పుస్తకం. తృతీయ ప్రచురణ. రచయిత కానెపు సుబ్రహ్మణ్యం. హిందూ తాత్విక పరిషత్, గండిపేట, హైదరాబాదు—8.

## కాలగేయాలు

మూడవ భాగం. రచన సమతారావు. 92 పేజీలు. వెల: రు 1—30 పైసలు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## శివితారాధన

పద్యాల్లో శ్రీ వేంకటేశ్వర స్వామి స్తుతి. రచయిత వేటూరి. 36 పేజీలు. ప్రాప్తిస్థానం. 9, కార్పొరేషన్ రోడ్, టి. నగర్, మద్రాసు—17.

---

# పక్కవాళ్లే...

(47వ పేజీ తరువాయి)

ర్తించాలని ప్రయత్నిస్తూంటే — మనం ఒట్టి కార్బన్ కాపీగా తయారు కాక తప్పదు. బతుకు మిషనులా తయారై, వ్యక్తిత్వం లేకుండాపోయి, అలవాట్లు, ప్రసంగాలూ, యిరుగుపొరుగుల ఊహలకి బానిసలై బతికేయవలసి వస్తుంది. అలా కాకుండా మన కిష్టమైనట్టు బతుకుదాం. మనని లైక్ చేసేవాళ్ళే మనకి స్నేహితులుగా మిగులుతారు అన్న ధైర్యంతో ఉంటే... మన వ్యక్తిత్వాన్ని కొంత కాలానికైనా చప్పినట్టు గుర్తిస్తారు. తప్పదు మరి. ●


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Chief Editor : S. Sambhu Prasad.

అధిక దిగుబడినిచ్చే
క్రొత్త రకాలు వస్తున్నాయని
తెలిసింది ...

దిగుబడి నధికం జేసే
గ్రోమోర్
ఎరువులు వాడి చూశావా?



దిగుబడి నధికం జేసే గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువులు వాడితే,
అధిక లాభాలు ఖాయం
ఎక్కువ పోషక పదార్థాలున్న గ్రోమోర్ కాంప్లెక్స్ ఎరువులు అన్ని రకాల పైర్లకు బాగా పనికొస్తాయి ఎందుకనంటే.

■ వాటిలో నత్రజని పూర్తిగా అమోనియా రూపములో లభించును
■ వాటిలో ఉన్న భాస్వరామ్లం పూర్తిగా నీటిలో కరుగుతుంది ■ అవి గుళ్లు గుళ్లుగా ఉండటం వల్ల, అన్ని విధాలా అనువైనవి.

గ్రోమోర్ వాడటం వల్ల పంట దిగుబడి ఎట్లా పెరిగేది దేశం అంతటా వేలకు వేల రైతులు తెలుసుకున్నారు మీరు కూడా గ్రోమోర్ వాడి లాభాలు సంపాదించండి!




గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28-28-0
గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 20-20-0
గ్రోమోర్ యూరియా 46-0-0

చేనుకు సేవ
రైతుకు రక్ష
గ్రోమోర్




కోరమాండల్
ఫెర్టిలైజర్స్ లి

మీకు కావలసిన గ్రోమోర్ ఎరువులు మీకు దగ్గరలో నున్న ప్యారీ వారి ఎరువుల డిస్ట్రిబ్యూటర్ల వద్ద కొనండి.

AIYARS-CF 158 REV TL-AP

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# బ్రిటానియా గ్లూకోస్
## మిల్క్ బిస్కట్లు
## ఎంతో రుచిగావుండే పుష్టికర ఆహారము




BBC 1317 R2